# వార్తకుడు వర్తకుడు






రచయిత: త్రిమత ఏకైక గురువు
ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త
ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**





# వార్తకుడు వర్తకుడు


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






ప్రచురించిన వారు

**ద్రావిడ శ్రేష్ఠి సంఘం**

(Regd.No. : 266/2015)

త్రైత శకము-42 ద్వితీయ ముద్రణ : మార్చి-2020

ప్రతులు : 1000 **వెల : 50/-**

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

"ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మపత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర.
41) భావము-భాష.
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము.
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము.
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు.
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.
76) నాది లోచన-నీది ఆలోచన.

“ఇందూ జ్ఞానవేదిక” ప్రచురణలు

77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) ఖుర్ఆన్, హదీసు ఏది ముఖ్యము?
98) భక్తిలో మీరు సంసారులా? వ్యభిచారులా?
99) సుప్రసిద్ధి బోధ.
100) ౧౦౦, శతము, 100.
101) సిద్ధి బోధ.
102) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
103) రూపము మారిన గీత.
104) పోలీసులు-నేరస్థులు.
105) ఇప్పటి మానవుని పరిస్థితి.
106) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ, 28. తాత,
29. తల్లి, 30. భయం.
31. ఆత్మపని, 32. బట్టతల.
33. యాదవ్, 34. జ్ఞానశక్తి.
35. సమాధి, 36. 6-3=6.
37. సంతకము, 38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము, 40. తోలేవాడు.
41. తల్లి తండ్రి, 42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ, 44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి, 46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము, 48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు, 50. పురుషోత్తమ.
51. మతద్వేషము, 52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ, 54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు, 56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి, 58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు, 60. దశ-దిశలు.
61. మాట-మందు,
52. సృష్టి-సృష్టికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.

106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు
మత సాంప్రదాయములు.
128. ఆహారము నీకా!
నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య. 132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. జలం. 138. అధిపతి.
139. గ్రహాంతర వాసులు.
140. దేవుడు ద్వితీయుడా? అద్వితీయుడా?
141. మనిషి చేతిలో భగవంతుడు-
దేవుని చేతిలో మనిషి.
142. శరీరములో రక్తము-
గ్రంథములో జ్ఞానము.
143. గ్రంథములో జ్ఞానము-
మనిషిలో రక్తము.
144. త్రైత సిద్ధాంత చరిత్ర.
145. కుశాల్ కుశాల్ లంజమ్మ
నా నెత్తిమీద రెండు తన్నమ్మ.
146. రాజాధి రాజా - దేవాధి దేవా.
147. ఎనిమిది మంది భార్యలున్న
శ్రీకృష్ణునికి గోపికల మీద ధ్యాస ఎందుకు?
148. కులం-మతం.
149. గురుపౌర్ణమి సందర్భముగా మీటింగ్
150. భగవంతుడు ఎవరు?
151. విశ్వదాభిరామ వినుర వేమా.
152. కాలం, 153. యమధర్మ.
154. కుడి ధర్మం-ఎడమ ధర్మం
155. గుడి.
156. ఇందుత్వము అందరిలో కలదు-
హిందుత్వము కొందరిలో కలదు.
157. ధర్మములు మూడే ఉన్నవి
అధర్మములు ఆరు అయినవి?
158. నేను-నా తండ్రి-నా తాత,
నేను-నా అమ్మ-నా అవ్వ.
159. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి (ప్రెసిడెంట్)**
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ (సూర్య మీ సేవా)**
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి.శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య (టీచర్) (ప్రెసిడెంట్)**
ప్రబోధాశ్రమము, తాడిపత్రి (మం)
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ (ప్ర.సభ్యుడు)**
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర (ప్రెసిడెంట్)**
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య (ప్ర.సభ్యుడు)**
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక (Head Office)**
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా,T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు (ప్ర.సభ్యుడు)**
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు (టీచర్) (ప్రెసిడెంట్)**
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్ (వైస్ ప్రెసిడెంట్)**
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ (వైస్ ప్రెసిడెంట్)**
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు (ప్రెసిడెంట్)**
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ (ప్రెసిడెంట్)**
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి (ప్రెసిడెంట్)**
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)**
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్రెసిడెంట్)**
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.



**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 9704651223, 9542385963

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హొస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**LAVANYA KANUMURI**
Cleveland, Ohio, U.S.A,
+1(440) 427 1158.

**S. RAGHU RAMI REDDY**
Seattle, WA, U.S.A,
+1 (425) 698 0375.

# వార్తకుడు - వర్తకుడు

దేవుడు ప్రపంచమును సృష్ఠించినప్పటి నుండి నేటివరకు గడచిన కాలములో జరిగిన ఘటనలు, సంఘటనలు, దుర్ఘటనలు అన్నిటినీ కలిపి "చరిత్ర" అంటున్నాము. చరిత్రలో ఎన్నో మార్పులు చేర్పులు జరిగిపోయినవి. సృష్ఠి మొదటిలో పుట్టిన మానవులంతా ఒకే సమాజముగాయుండిరి. తర్వాత జరుగు కాలములో మనుషులలోని గుణ ప్రభావము వలన మానవ సమాజములో మొదట కులములు పుట్టినవి. కృతయుగములోనే కులములు పుట్టగా కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము మూడు యుగములలోనూ కులముల వృద్ధి జరుగుచూ వచ్చినది. చివరిలో వచ్చిన కలియుగములో కులములకంటే వేరుగాయున్న మతము పుట్టినది. వెనుక కలియుగములో పుట్టిన మతము కులములకంటే పెద్దదయిపోయినది. కృతయుగములో పుట్టిన కులమే మనుషులను వేరువేరు తెగలుగా విభజింప జేసి, మనిషిని జ్ఞానమునుండి అజ్ఞానము వైపుకు మళ్ళించగలిగింది. కుల వ్యవస్థే మనిషిని అజ్ఞానమువైపు పంపి ఇది నా కులము, అది నీ కులము అను వ్యత్యాసములను ఏర్పరచి, దేవుడు పుట్టించిన ఒకే మానవజాతిని అనేక తెగలుగా చేసింది. మతముతో పోలిస్తే కులము ఎంతో చిన్నది. ఒక మతములో ఎన్నో కులములున్నవి. కలియుగములో భారతదేశములో యున్న ప్రజలకు మతము అనునది అతికించబడినది. అంతకుముందు మూడు యుగములలో భారతదేశ ప్రజలకు **"ఇందువులు"** అను బిరుదు ఉండెడిది. ఇందువులు అనగా జ్ఞానులు అని అర్థము. జ్ఞానులని ఇతర దేశముల చేత పిలువబడు భారతీయులను ప్రత్యేకించి ఇందువులు అని అనెడివారు. ఇందువులు అనునది అప్పుడు మతముగా చెప్పబడలేదు. ఇందువులు జ్ఞానులు అను అర్థముండునట్లు భారతదేశములోయున్న

జ్ఞానులనుబట్టి భారతదేశమును ఇందూదేశముగా పిలిచారు. **"ఇందూ దేశము"** అనగా **"జ్ఞానదేశము"** అని అర్థము.

కృతయుగములో భారతదేశములోని మనుషులంతా ఇందువులుగా యుండినా, తర్వాత జరిగిన కాలములో మనుషులలోని గుణప్రభావము వలన వారిలోని జ్ఞానము సన్నగిల్లుచూ వచ్చి, ఒకే జాతిగాయున్న ఇందువులు కులాలరూపములో చీలిపోతూ వచ్చారు. అలా మొదట మొదలయిన కులవ్యవస్థ అను చెట్టు చివరకు పెరుగుచూపోయి పెద్ద వృక్షములాగా తయారయినది. కులము అను పేరులేని ఇందువులలో కులము అను చెట్టు ఎలా మొలకెత్తినదో గతచరిత్రలోనికి తొంగిచూస్తే (వంగిచూస్తే) ఇలా తెలియుచున్నది. సూర్యుడు ఆకాశమునుండి దిగివచ్చి మనువునకు జ్ఞానమును తెలియజేయగా, మనువు ఇక్ష్వాకుడు అను సూర్యవంశ రాజుకు తెలియజేశాడు. ఇక్ష్వాకుడు అను రాజునుండి తర్వాత రాజులు, ఋషులు తెలుసుకొనిరి. చివరకు వారివలన ప్రజలందరికీ దైవజ్ఞానము తెలిసిపోయినది. సూర్యుడు భూమిమీద జ్ఞానము చెప్పినప్పుడు ఒకే మానవ సమాజముండెడిది. అప్పుడు వారిలో ఏ విధమైన హెచ్చు తగ్గులు లేవు. సమసమాజముగాయున్న ఆనాటి ప్రజలకు ఎప్పుడయితే జ్ఞానము తెలిసిందో, అప్పుడే వారిలో కొద్దిగా మాయ కూడా పని చేయను మొదలుపెట్టింది. ఆకాశములోయున్న సూర్యగ్రహము మండుచున్న అగ్నిగోళమని ఈనాడు చాలామందికి తెలుసు. ఈ భూగోళముకంటే ఎన్నో లక్షల రెట్లు పెద్దదయిన సూర్యగోళములో కూడా ఒక జీవుడున్నాడు. సూర్యగోళములోని జీవుడు సూక్ష్మరూపముతో భూమిమీదికి వచ్చి, తాను ఆకాశములో వాణిద్వారా వినిన జ్ఞానమును భూమిమీదయున్న 'మనువు' అను ఒక వ్యక్తికి చెప్పడము జరిగినది. ఎప్పుడయితే మనువు జ్ఞానమును

సూర్యునిద్వారా తెలియగలిగాడో, అప్పుడే మనువు అను వ్యక్తిలో కొద్దిగా మాయ పని చేసినది. అది మాయ అని తెలియకుండా మనువు తలలోని గుణము పనిచేసి, సూర్యుడు తనకు జ్ఞానము చెప్పినందుకు, తన తలలో సూర్యుని జ్ఞానము నిలువయున్నందుకు, తన ముఖము మీద నుదుటి భాగమున సూర్యుని గుర్తును పెట్టుకోవడము జరిగినది.

సూర్యుడు చెప్పిన జ్ఞానము తనలోయుందన్నట్లు తెలుపడమేగాక, సూర్యుడు తనకు జ్ఞానము చెప్పినందుకు ఆయన మీద గౌరవముతో, **"మంచి చేసినవానిని మరువకూడదను"** భావముతో మనువు తన నుదుటి మీద సూర్యుని ఆకారమును ముద్రించుకొన్నాడు. మనువు ఇక్ష్వాకుడను రాజుకు తనకు సూర్యుని ద్వారా తెలిసిన జ్ఞానమును చెప్పాడు. ఇక్ష్వాకుడు మనువుద్వారా జ్ఞానమును తెలియుటవలన మనువును గురువుగా భావించి, ఆయన నుదుటిమీద ధరించిన సూర్యుని గుర్తును ఇక్ష్వాకుడు కూడా పెట్టు కొన్నాడు. అలా ఇక్ష్వాకుడు మొదట సూర్యుని గుర్తును తన నుదుటిమీద పెట్టుకోగా, అప్పటినుండి ఆయనను సూర్యవంశపు రాజుగా అందరూ అనుకోవడము జరిగినది. మనువునుండి ఇక్ష్వాకునికి, ఇక్ష్వాకునినుండి పరంపరగా లోకమునకంతటికీ దైవజ్ఞానము తెలిసిపోయినది. అప్పుడు దేవుని జ్ఞానమును బాగా జీర్ణింప చేసుకొన్నవారు మిగతా ప్రజలకు జ్ఞానమును చెప్పుచుండిరి. జనాభా తక్కువయున్న ఆ కాలములో 50 మైళ్ళకొక ఊరు ఉండెడిది. ఒక ఊరినుండి మరొక ఊరికి పోవాలంటే గుర్రాలమీద, ఎద్దులబండ్లమీద పోయెడివారు. అవి ఏవీలేనివారు కాలినడకన ప్రయాణించెడివారు. ఇప్పటివలె అప్పుడు రవాణా సౌకర్యము లేదు. అందువలన ఏ ఊరిలోవారు ఆ ఊరిలో ఇతరులకు జ్ఞానము చెప్పుచుండిరి. జ్ఞానమును బాగా అర్థము చేసుకొన్నవారు ఆ ఊరిలో

జ్ఞానము తెలియని ప్రజలకు తమకు తెలిసిన జ్ఞానమును చెప్పుచుండిరి. ఈ విధముగా ఒక ఊరిలో పదిమంది జ్ఞానము చెప్పువారుండగా వేయి మంది జ్ఞానమును వినేవారుండిరి. ఇక్ష్వాకుడు అను రాజుద్వారా జ్ఞానము తెలియుట వలన, ఊరిలో జ్ఞానమును చెప్పు పదిమంది ఇక్ష్వాకున్ని తమ గురువుగా చెప్పుకొనుచుండిరి. అలా కొంతకాలము గడువగా జ్ఞానమును చెప్పువారు, జ్ఞానమును వినువారు అను రెండు రకములుగా ఊరిలోని ప్రజలు విభజింపబడి జ్ఞానము తెలియు ప్రజలు, జ్ఞానమును తెలుపు వారిని గౌరవముగా చూచుచుండిరి. ఇంకా కొంతకాలముండగా జ్ఞానము చెప్పువారిలో కొంత అభిప్రాయ భేదములు ఏర్పడి బోధించు పదిమందిలో ఐదుమంది ఒకవైపు, మరొక ఐదుమంది మరొకవైపు చీలిపోయి రెండు గుంపులుగా ఏర్పడిపోయారు. ఈ విధముగా రెండు గుంపులుగా తయారయిన బోధకులలో ఒక గుంపువారు మేము సూర్యవంశము వారమని చెప్పుకొనుచూ, మూడు నిలువు నామములను పెట్టుకోగా, మిగతా ఐదుమంది గుంపుగాయున్నవారు మేము చంద్రవంశము వారమని చెప్పుచూ, అడ్డముగాయున్న విభూతిరేఖలను పెట్టుకోవడము జరిగినది. సూర్యవంశమువారు సూర్యుని బొమ్మను నుదుటి భాగము మీద పెట్టుట కష్టమైనందున సూర్యుని బదులు నిలువునామములు పెట్టుకొని మేము సూర్యవంశమువారమని చెప్పిరి. అట్లే వారికి వ్యతిరేఖ గుంపువారు మేము చంద్రవంశమువారమని చెప్పుకొనుచూ వారు చంద్రునికి బదులు అడ్డనామములయిన విభూతిరేఖలను ధరించారు. ఇట్లు కొంత మాయ ప్రభావము చేత బోధకులలో కూడా సూర్య, చంద్రవంశములని రెండు తెగలు ఏర్పడడము జరిగినది.

మొదట కులము లేని కృతయుగములో సూర్యవంశము అనీ, చంద్రవంశము అనీ రెండు రకముల గుంపులు తయారయినవి. రెండు గుంపులుగాయున్న జ్ఞానబోధకులు సూర్యుడు, మనువు, ఇక్ష్వాకుడు అను వారి ద్వారా వచ్చిన జ్ఞానమును ఒకరికంటే మరొకరు తక్కువ లేకుండా బోధించుచుండిరి. వినే ప్రజలు కూడా శ్రద్ధగా వినుచూ జ్ఞానమును బాగా గ్రహించుకొనుచుండిరి. అయితే వినే ప్రజలకు జ్ఞానము తెలియుటకు దినములో సమయము తక్కువ వచ్చుచుండెను. ఒక దినములో పనులన్నీ చేసుకోగా ఆ పనులకే సమయము సరిపోయెడిది. ఆ కాలములో తిండి కంటూ సరుకులు కావాలంటే యాభైనుండి వందమైళ్ళ (80 నుండి 160 కిలోమీటర్ల) దూరములోనున్న పట్టణములకుపోయి రైతుల దగ్గర పండిన ధాన్యము ఒకచోట, చింతవనములను పెంచిన రైతుదగ్గరకు పోయి చింతపండును మరొకచోట కొనెడివారు. ఉప్పు కావలసివస్తే సముద్ర తీర ప్రాంతములో ఉప్పు తయారీదారులనుండి ఉప్పు తెచ్చుకొనెడివారు. ఈ విధముగా అనేకచోట్లకు పోయి వారికి కావలసిన సామాన్లు, సరుకులు తెచ్చుకొనెడివారు. అప్పటికాలములో పాత్రలన్నీ మట్టితో చేసినవే వాడే వారు. వంట వండుకొనుటకు, నీళ్ళు తెచ్చుకొనుటకు మట్టిపాత్రలనే ఉపయోగించేవారు. ప్రతి ఊరిలోనూ మట్టిపాత్రలు చేయు కుమ్మరి వారుండుట వలన చిన్నముంత, మూకటినుండి, చిన్న కడవనుండి పెద్దబానల వరకు మట్టితో చేసినవి ఊరిలోనే దొరికెడివి. అట్లే ఊరిలోనే కమ్మరివారు, మంగళివారు, చాకలివారు ఉండుట వలన, కొందరు ధాన్యమును పండించు రైతులుండుట వలన ప్రజలకు కొన్ని అవసరములు తీరినా మరికొన్ని అవసరములకు దూరప్రాంతములోయున్న ఊర్లకు పోవలసియుండెడిది. అందువలన ఎక్కువ కాలము బయటి ఊర్లకు పోయి

కావలసిన వస్తువులను, సరుకులను తెచ్చుకొనుటకు సరిపోయెడిది. ఇప్పటివలె అప్పుడు బజార్లు, వ్యాపారకూడళ్ళు, సరుకుల అంగళ్ళు ఉండేవికావు. ఇటువంటి ఇబ్బందుల వలన ఎక్కువ కాలమును జ్ఞానమును తెలుసుకొనుటకు ప్రజలు ఉపయోగించుకోలేక పోవుచుండిరి.

అప్పటికాలములో ప్రజలు ఎక్కువగా మూఢనమ్మకము కలవారై యుండి, ప్రతి దానిని నమ్మీనమ్మలేని స్థితిలోయుండి, 'రోగాలకు దేవతలకు శాంతులు చేస్తే బాగుంటాము' అను మూఢనమ్మకము కల్గి, జ్ఞానమునకంటే దేవతల శాంతులకే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చుచుండిరి. పూర్తి జ్ఞానము తెలియని మనుషులు దారము తెగిన గాలిపటములాగా ఎటు గాలివస్తే అటుపోయినట్లు ఒక స్థిరత్వము లేకుండా ఉండిరి. అటువంటి ప్రజలకు జ్ఞానము చెప్పు బోధకులు రెండు గుంపులుగా తయారయి సూర్యవంశము వారని, చంద్రవంశము వారని చీలిపోయి మేము గొప్ప, మేము గొప్పయని పోటీగా జ్ఞానమును చెప్పుచుండిరి. అంతేకాక తాము గొప్ప అని చాటుకొనుటకు తమవైపు ఎక్కువ ప్రజలను ఆకర్షించాలనుకొన్నారు. ఆ ప్రయత్నములో ప్రజల అవసరములను తామే తీర్చి తమవైపు ఎక్కువ మందిని రప్పించుకోవాలని ప్రయత్నము చేయుచుండిరి. రెండు గుంపులుగా యున్న బోధకులు తమ ఆధిపత్యమును తెలుపుటకు తగిన విధముగా ప్రయత్నించవలెనని యోచించి, సూర్యవంశము గుంపువారు ప్రజల మూఢనమ్మకములను ఆసరాగా తీసుకొని, వారి అనుమానములకు తగినట్లు మంచి చెడు దినములనీ, మంచి ముహూర్తములనీ, గ్రహబలమనీ, జాతకములనీ, స్థానబలమనీ చెప్పుచూ, వాటిని ఆచరించి కొన్ని ముహూర్తములలో పనులుచేస్తే అవి నెరవేరుతాయనీ, దానివలన ఎక్కువ

లాభములు వస్తాయనీ ప్రజలకు చెప్పి వారిని తమవైపు లాగుకొనుటకు ప్రయత్నించారు.

అప్పుడు వారిమాటలను వినిన కొందరు ప్రజలు వారివైపు ఎక్కువగా పోసాగిరి. దానిని చూచిన చంద్రవంశమని పేరుపెట్టుకొన్న బోధకులు తాము కూడా ప్రజలకు మంచిగా కనిపించి తమవైపు వచ్చునట్లు, తమ బోధలను వినునట్లు చేసుకోవాలని యోచించి ఒక నిర్ణయానికి వచ్చారు. ప్రజలు తమకు అవసరమైన వస్తువుల కొరకు దూరప్రాంతము లకు పోయి శ్రమపడి తెచ్చుకోవడమేకాక కాలమును వృథా చేయుచున్నారని తెలిసి, వారికి కావలసిన వస్తువులన్నీ తమవద్దనే ఉంచుకొంటే ప్రజలందరూ తమ దగ్గరకే వచ్చుటకు అవకాశముగలదని తెలిసి, ప్రజల అవసరములను తాము తీర్చితే, దానికొరకు వినియోగపడే కాలమంతయూ ప్రజలు తమవద్దనే గడుపుదురని తలచి, వెంటనే సమస్త వస్తువులు, సరుకులు అన్నిరకముల అవసర నిమిత్తము కావలసిన సామాగ్రియంతటినీ సేకరించి తెచ్చి తమవద్ద పెట్టుకొని ప్రజల అవసరములను తీర్చుతూ, వారికి కొంత సమయము దొరుకగా, ఆ సమయములో తమవద్ద జ్ఞానమును వినునట్లు తమవద్దకు వచ్చునట్లు చేసుకొనిరి. ఆ విధముగా చంద్రవంశపు బోధకులు కిరాణా అంగళ్ళను తమవద్దనే స్థాపించుకొని, ప్రజల అవసరముల నిమిత్తము దూరప్రాంతములకు పోకుండా తమవద్దకే వచ్చునట్లు చేసుకొన్నారు. వీరికంటే ముందే సూర్యవంశ బోధకులు ప్రజలకు పంచాంగములను చూచి, ప్రతి దానికి మంచి చెడు రోజులను నిర్ణయించి చెప్పెడివారు. చివరకు గడ్డము కొరిగించుకొనుటకు, తలస్నానము చేయుటకు, ప్రయాణమునకు, ఇల్లు కట్టుటకు, పెళ్ళికి, పేరు పెట్టుటకు,

విద్యాభ్యాసమునకు, కొత్తవస్త్రములు ధరించుటకు, ప్రసవమునకు, గర్భ దానమునకు, పొలము దున్నుటకు, విత్తనము వేయుటకు అని ప్రతిదానికీ మంచి చెడు ముహూర్తములను నిర్ణయించి, ఫలానా అప్పుడు చేస్తే మంచిదని, మిగతా సమయములలో చేస్తే చెడు కల్గునని చెప్పి ప్రజలకు మేలు చేయువారిగా కనిపించుచుండిరి.

మూఢనమ్మకములను నమ్మినవారు, ప్రతి పనికి మంచి దినము, మంచి సమయము కావాలనువారు చాలామంది సూర్యవంశ బోధకుల దగ్గరికి పోవుచుండిరి. అటువంటి సమయములో ప్రజలతో కలిసి వారికి హితము చేయునట్లు కనిపించు సూర్యవంశబోధకులు తాము ఊరిలోని ప్రజలందరికీ మంచి చేయువారమని అందరికీ తెలియునట్లు, ఆ పేరు శాశ్వితముగా ఉండునట్లు **"పౌర హితులు"** అని వారు తమను చెప్పు కోవడము జరిగినది. ఆ పేరు పూర్తిగా కలిపి చివరకు "పౌరోహితులు" అని చెప్పుకొన్నారు. ఆ విధముగా ఆనాటి బోధకులకు పౌరోహితులని వచ్చిన పేరు నేటికి పురోహితులుగా మారిపోయినది. అయితే కృతయుగము లోనే ఆ పేరు ఎట్లు వచ్చినది, ఈ రోజు పురోహితులుగాయున్న వారికి బహుశా తెలియదనుకుంటాము. ఎందుకనగా జరిగిపోయిన మూడు యుగముల కాలములో ఎన్నో మార్పులు చేర్పులు వచ్చి చాలా విషయములు తెలియకుండా చరిత్రలో కలిసిపోయాయి. పూర్వము కృతయుగములో పౌరోహితులుగా మొదలయిన వారు నేడు పురోహితులుగా పిలువబడుచున్నా, ఆనాడు తాము సూర్యవంశమునకు సంబంధించిన వారుగా ఉండెడివారమనీ, ఇక్ష్వాకుని జ్ఞానమును చెప్పెడివారమనీ ఈనాడు మరచిపోయారు.

ఆనాడు జ్ఞానములో వచ్చిన భేదాభిప్రాయముల వలన చీలిపోయి సూర్యవంశము, చంద్రవంశము అని పోటీగా చెప్పుకొన్నవారు చివరకు నేడు సూర్య చంద్రవంశములను పేర్లను పూర్తిగా మరచిపోయారు. తాము పూర్వము ఏ పేరుతో చలామణి అయినది తెలియకుండా పోయారు. ఆనాటి బోధకులలో ఒకగుంపు సూర్యవంశము వారిగా చెప్పుకోగా, రెండవ గుంపుగా చీలిపోయినవారు ఆ పేరుకు పోటీగా మేము చంద్రవంశము వారమని చెప్పుకొన్నా, మధ్యలో వచ్చిన మార్పుల వలన ఆనాడు జ్ఞానము చెప్పిన సూర్యవంశమువారు మేము పురోహితులమని అంటున్నారు, అది వృత్తిరీత్యా వచ్చిన పేరని అనుకొన్నారుగానీ, దానికి గతములో ఒక చరిత్రవుందని తెలియలేకపోయారు. ప్రతి పనికీ మంచిరోజును చెడు రోజును నిర్ణయించి, ప్రజలకు హితము చేయువారిగా కనిపించుట వలన సూర్యవంశము వారు చేయు పురోహితమునకు సాటిగా చంద్రవంశము వారు కూడా ప్రజలకు హితము చేయదలచి, ప్రజలు వారి అవసరనిమిత్తము కావలసిన సామాగ్రి కొరకు బయట ఊర్లకు ప్రయాణించి పోకుండా వారికి కావలసిన సామాగ్రి అంతయూ తక్కువ ఖర్చుతో వారికి లభించునట్లు చేయాలను ఉద్దేశ్యముతో అంగళ్ళను ప్రారంభించి ప్రజలకు సరుకులను అందించడము జరిగినది. అప్పుడు ప్రజలు దూరప్రయాణమునకు వినియోగించు కాలమును తమవద్దనే గడుపునట్లు చేసి ప్రజలకు జ్ఞానమును చెప్పుచుండిరి. ప్రజలకు దైవసంబంధమైన సమాచారమును చెప్పెడివారని అందరికీ తెలియునట్లు, ఆ పేరు శాశ్వితముగా ఉండునట్లు సూర్యవంశము వారు తమను తాము పౌరోహితులుగా ప్రకటించుకొన్నట్లు, చంద్రవంశము వారు కూడా తమకు కూడా ఒక ప్రత్యేకమైన పేరును ఉంచుకోవాలని కొంత యోచించి, చివరకు ఒక నిర్ణయానికి వచ్చి ఇలా అనుకొన్నారు.

తాము ప్రజలకు దేవుని సమాచారమైన దైవజ్ఞానమును అందించుచున్నాము, కావున తాము దేవుని వార్తలను తెలుపు నిజమైన బోధకులమని గుర్తుండునట్లు, తమను అందరూ అదే పేరుతో పిలువవలెనని అనుకొన్నారు. దానికి తగినట్లు తమను తాము **"వార్తకులు"** అని పేరు పెట్టుకొన్నారు. వార్తకులు అనగా వార్తలను అందించువారని అర్థము. దేవుని జ్ఞానమే నిజమైన వార్తలుగా ప్రజలు లెక్కించెడివారు. అందువలన దైవజ్ఞానమును చెప్పు చంద్రవంశ బోధకులను ప్రజలు "వార్తకులు" అని సంబోధించ సాగారు. ఆనాడు చంద్రవంశ బోధకులు వార్తకులుగా తమ పేరును శాశ్వితముగా ఉండునట్లు, తామే నిజమైన దైవవార్తలను అందించు వారమని వార్తకులమని చెప్పుకోగా, నేడు ఆ పేరు వర్తకులుగా సమాజములో మిగిలిపోయినది. అంగడి అమ్ముకువారు వర్తకులు అంటున్నారు గానీ, ఈ అంగడికి, ఆ వర్తకునికి సంబంధమేమియని ఎవరూ ఆలోచించలేదు. నేడు వర్తకులని పిలువబడువారు తాము పూర్వము చంద్రవంశము అను పేరుతో చలామణి అగుచూ, దేవుని జ్ఞానమును ప్రజలకు చెప్పెడివారమని తెలియక, తమ పూర్వీకుల చరిత్రను పూర్తి తెలియనివారై, తమ పేరును తాము మరచినవారై, తమ పేరు వర్తకుడు కాదు వార్తకుడుగాయుండేదని తెలియక, వారు కూడా తమను వర్తకులమనియే చెప్పుకొంటున్నారు. వర్తకులను పేరు పూర్వము వార్తకులుగా ఉండేదనీ, వార్తకులుగాయుండు వారే చంద్రవంశముగా చెప్పబడేవారని తెలియక పోవడమువలన చంద్రవంశము వారు ఎవరో చెప్పలేని స్థితి వర్తకులు, సూర్యవంశమువారు ఎవరో తెలియని స్థితిలో పురోహితులు ఉండిపోయారు. చివరకు సూర్యవంశము చంద్ర వంశము తాము పెట్టుకొన్న పేర్లని, అవి తమతోనే మొదలయినాయని తెలియక, ఆ రెండు పేర్లను పూర్వపు రాజులకు అంటగట్టుచున్నారు.

ఫలానావారు సూర్యవంశము రాజులనీ, ఫలానావారు చంద్రవంశ రాజులనీ కట్టుకథలను అల్లుచున్నారు. ఆదిలో సూర్యుడు జ్ఞానమును చెప్పడము వలన ఆయన పేరును ప్రజలు మరువకూడదని మనువు, ఇక్ష్వాకుడు సూర్యగుర్తును తమ ముఖము మీదపెట్టుకోగా చివరకు సూర్యునికి పోటీగా చంద్రవంక తయారై దానిని ధరించువారు తయారైనారనీ, ఇదంతయూ దైవజ్ఞానమువద్ద జరిగిన అభిప్రాయభేదముల వలన వచ్చిన మార్పులని ఈనాడు పురోహితులను వారుగానీ, వర్తకులమను వారుగానీ అనుకోవడము లేదు.

నేడు పురోహితులని ఒక తెగవారు, వర్తకులని మరొక తెగవారు చెప్పబడుచున్నా వారికి ఆ పేర్లు ఎలా సంక్రమించాయో వారికే తెలియ కుండాపోయినది. తాము మొదట దైవజ్ఞానమును బోధించు బోధకులుగా ఉండెడివారమను విషయమును వారు పూర్తి తెలియకుండా పోయారు. కాలగర్భములో బ్రతికినవారు పోతూ, లేనివారు వస్తుండడమువలన జరిగిన చరిత్ర తెలియకుండా పోయిన మాట వాస్తవమే అయినా, నేడు పూర్వమున్న తమ చరిత్రకు గుర్తులుగాయున్న పేర్లు నేటికీ కొంత మార్పుతో మిగిలి యున్నాయి. ఆ మిగిలియున్న తమ గుర్తులను కొంత శోధించితే సులభముగా వారికి కొంత సమాచారము తెలియుటకు అవకాశమున్నా నేడు ప్రపంచ విషయములలో మునిగిపోయిన సూర్యచంద్రవంశము వారయిన పౌరహితులు, వార్తకులు తమ పనులలో నిమగ్నమైపోయారు గానీ, వెనుకటి చరిత్రను తెరచి చూడలేకపోవుచున్నారు. ఆనాడు వేయిమంది ప్రజలకు పదిమంది జ్ఞానమును చెప్పువారు తయారైనా, వారిలోనే మాయప్రభావము చేత రెండు చీలికలు ఏర్పడి సూర్య చంద్ర

అను కనిపించు గ్రహముల పేరుతో వారు పిలువబడినవారయి, ప్రజలలో ఉత్తములుగా, ప్రజలలో గొప్ప జ్ఞానులుగా, ప్రజలలో పెద్ద మేథావులుగా చలామణి అయినవారు  నేడు భూమిమీద మన ప్రాంతములో మనకు తెలియు అగ్రకులములయిన బ్రాహ్మణ, వైశ్య కులములుగా చెప్పబడు చున్నారు. ఆనాడు అందరికంటే మేథావులుగాయున్న ఆ రెండు తెగలు, నేడు భూమిమీద రెండు కులములుగా మార్పు చెందియున్నాయని తెలియు చున్నది. ఆనాడు వారివద్ద జ్ఞానమును వినిన మిగతా ప్రజలందరూ నేడుగల బ్రాహ్మణ, వైశ్య కులములకు తక్కువగాయుండడము ఆనాటి చరిత్రకు గుర్తుగాయున్నది. నేడు బ్రాహ్మణులుగాయున్నవారు తమ పూర్వ చరిత్ర ఈ విధముగాయున్నదని తెలియలేకపోయారు. అట్లే వైశ్యులు లేక కోమటి అని పిలువబడువారు పూర్వపు తమ చరిత్రను పూర్తిగా మరచిపోయినవారై వర్తకులము అనియో, కోమటివారమనియో అని అనుకొనుచున్నారు. పూర్వము సూర్య చంద్ర వంశమువారు ఇరువురూ చాలా తెలివైనవారనీ, అందువలననే వారు దైవజ్ఞానమును ప్రజలకు చెప్పగలిగారనీ మనము చెప్పుకొన్నాము. సూర్యచంద్రవంశమువారు ఆనాడు చాలా తెలివైనవారు అనుటకు గుర్తుగా నేడు వారు బ్రాహ్మణ, వైశ్య (కోమటి) అను కులముల పేర్లతో పిలువబడుచున్నా, వారి వంశ పారంపర్య జీన్సు వారిలోరాగా, నేటికినీ ఆ రెండు కులములవారు బుద్ధిలో గద్దెనెక్కినవారై, ప్రతిభలో ప్రకాశవంతులై అందరిచేత ఆ రెండు కులములవారు తెలివైనవారనిపించుకొంటున్నారు.

నేడు బ్రాహ్మణులు తమ చరిత్రను తాము మరచిపోయిన వారైనా, ప్రజలు మాత్రము గొప్ప కులమువారనీ, తెలివైనవారనీ అనుకోవడము

జరుగుచున్నది. అట్లే కోమటి కులమున పుట్టినవారు ఎవరైనా తెలివైనవారని పేరుగలదు. వారివారి కులవృత్తులలో బ్రాహ్మణులు ఒక విధమైన పనిని చేయగా, వైశ్యులు వ్యాపారమును చేయుచున్నారు. బ్రాహ్మణులు అంటే దైవపూజ చేయువారనీ పంచాంగమును తెలిసినవారనీ అందరికీ ఒక గుడ్డి గుర్తువుండగా, వైశ్యులు అంటే వ్యాపారము చేయువారని అనుకోవడము జరుగుచున్నది. అయితే ఎటు చూచినా సమాజములో వారు ఏమాత్రము కష్టపడకుండా తెలివిగా బ్రతుకుచున్నారని మిగతా ప్రజలు అందరూ అనుకోవడము జరుగుచున్నది. అంతేకాక **"బ్రాహ్మణుడు"** అంటే బ్రహ్మ జ్ఞానము కలవాడని కొందరనగా, **"కోమటి"** అంటే ప్రపంచ తెలివిలో వారిని మించినవారు లేరు అని కూడా కొందరంటున్నారు. వాస్తవముగా చూస్తే సమాజములో బ్రాహ్మణ, వైశ్య అను రెండు కులములు అగ్ర కులములుగా లెక్కింపబడగా, "తెలివిలో వారిద్దరికీ ఎవరూ సరిరారు" అను భావము అందరి మనస్సులోగలదు. నేటికీ వారు తెలివిగా మాట్లాడడముగానీ, తెలివిగా ప్రవర్తించడముగానీ అందరూ గమనించ వచ్చును.

"బ్రహ్మజ్ఞానము" అనగా దేవుని యొక్క జ్ఞానము. బ్రహ్మ అనగా పెద్దయని అర్థము. బ్రహ్మ జ్ఞానము అనగా పెద్ద జ్ఞానమని చెప్పాలి. ప్రపంచములో అన్నిటికంటే పెద్ద జ్ఞానము దేవుని జ్ఞానము తప్ప ఇంకొకటి లేదు. అప్పటికాలములో సూర్యవంశమువారయిన పురోహితులు ప్రజల పట్ల తాము ఎట్లున్నదీ అందరికీ అర్థము కావలెనని, తమను పురములో నివసించు ప్రజలకు మేలు చేయువారని తెలియునట్లు తమను తాము "పౌరోహితులు" అని చెప్పుకొన్నారు. దానికి తగిన విధముగా ప్రజలకు మేలు చేయునట్లు ప్రతి దానికి ముహూర్త కాలమును చెప్పెడివారు. ఆ

విధముగా ప్రజలకు పరిచయమైన తర్వాత తమ చరిత్రను మరచినవారై చివరకు తాము సూర్యవంశము వారని కూడా తెలియకపోయినది. ఒక తెగ బోధకుల పని ఆ విధముగా మారిపోవడమేకాక, వారు ప్రజలకు దేవుని జ్ఞానము చెప్పడము మానివేసి, చివరకు పూర్తిగా పంచాంగములకే పరిమిత మైపోయారు. ఈ విధముగా కొంతకాలమునకు నిజదైవజ్ఞానము వారికే తెలియకుండా పోయినది. వారికి తెలిసినదంతా పంచాంగము, అందులోని నక్షత్రములు, గ్రహములు. వీరి పరిస్థితి అలా తయారుకాగా పూర్వము చంద్రవంశము వారమని చెప్పుకొన్న బోధకులు సూర్యవంశ బోధకులకు పోటీగా తయారగుటకు, వారికంటే తామే గొప్ప అని తెలియుటకు సూర్యవంశము వారితో సలిపిన ఆధిపత్యపోరులో పూర్తి లగ్నమై ప్రజలకు ప్రపంచ విషయములలో ఎక్కువ మేలు చేయుచూ, మేము మీకు పరమాత్మ జ్ఞాన సమాచారమును తెలుపువారమని అర్థమగునట్లు, ప్రజలకు ప్రపంచ విషయములలో సరుకులను అందించినా, పరమాత్మ విషయములో దేవుని జ్ఞానసమాచారమును అందించు వార్తకులమని చెప్పుకొనిరి. వార్త అనగా తెలియబడు సమాచారము అని అర్థము. తెలియబడు సమాచారము ప్రపంచముది కావచ్చు, పరమాత్మది కావచ్చు. అయితే ఇక్కడ దేవుని జ్ఞానమును తెలియజేయువారిగా వారిని వారు **"వార్తకులు"** అని చెప్పుకొన్న చంద్రవంశమువారు పూర్తి దైవవార్తలను చెప్పక ప్రపంచ విషయములనే ఎక్కువగా చెప్పుచుండిరి. తాము చంద్రవంశము బోధకులను విషయమును మరచిపోయి, తాము జ్ఞాన వార్తకులమను విషయమును జ్ఞాపకము లేనివారై, తమ పేరు వార్తకులనీ పూర్వము పిలువబడినదనీ, దానికి ఫలానా అర్థమున్నదని తెలియనివారై నేడు పేరును మార్చి మేము వర్తకులము అంటున్నారు. ఈ విధముగా వార్తకులు వర్తకులైపోయారు. పౌరోహితులు

అను పేరు కొద్దిగా మార్పుచెంది పురోహితులని పిలువబడినా, అందులో అర్థము పెద్దగా మారిపోదుగానీ, వార్తకులు పోయి వర్తకులు అయినప్పుడు అందులోని మొదటి రహస్యము తెలియకుండాపోయినది.

బహుముఖ ప్రజ్ఞాశాలురైన పురోహితులుగానీ, వర్తకులుగానీ తమ ప్రజ్ఞ ప్రపంచములో అనేకవైపుల ముఖము కల్గినదైయున్నా, చివరికి అంతర్ముఖ ప్రజ్ఞ లేకుండా పోయినది. గత చరిత్రలో ప్రపంచ ప్రజలందరికీ దైవజ్ఞానమును అందించి, అందరికంటే అగ్రకులము వారని పేరుపొందినా, నేడు ఆ పేరుకు తగినట్లు లేకుండాపోయారని చెప్పవచ్చును. ఇది కలియుగము. మొదటిది కృతయుగము. అప్పటికి ఇప్పటికి దాదాపు 2 లక్షల సంవత్సరముల చరిత్ర గలదు. ఆ చరిత్రలో నేడు పురోహితులమని అనిపించుకొన్న బ్రాహ్మణులు, వర్తకులు అని పిలువబడిన కోమటివారు, వారి ఆధిపత్యపోరు కొంతవరకు సాగించి చివరకు వారిపోరును వారే మరచి పోయారు. రెండు గుంపులుగాయున్నవారు "మేము పెద్ద" అనిపించు కొనుటకు ఒకరికంటే మరొకరు ముందుకు పోవాలను ఉద్దేశ్యముతో చరిత్రలో తమను ఇంకా కొన్ని పేర్లతో పిలిపించుకొన్నారు. గతములో వారిపేర్లు ఇంకా ఏవి ఉండేవి? అవి చివరకు ఎలా మారిపోయాయి? నేడు ఏ రూపములో పిలువబడుచున్నవో కొంత వివరించుకొని చూస్తాము. ఇక్కడ కొందరు ఒక ప్రశ్నను అడుగవచ్చును. అదేమనగా! మేధావులుగా యున్న వారి చరిత్ర వారికే తెలియనప్పుడు, ఇప్పుడు నీకెలా తెలిసింది? గడచిపోయిన కాలగర్భములో కలిసిపోయిన చరిత్రను మీరు ఎలా చెప్పగలుగుచున్నారు? అని అడుగవచ్చును. దానికి జవాబుగా మేము ఇట్లు చెప్పుచున్నాము.

భవిష్యత్తు అంధకారమైనది. అందువలన జరుగబోవునది చెప్పుట చాలా కష్టమగును. భవిష్యత్తును ఆత్మ తెలియజేస్తే తప్ప ఎవరూ చెప్పలేరు. వీరబ్రహ్మముగారికి ఆత్మ అందించిన సమాచారమునుబట్టి ఆయన అనేక భవిష్యత్తు విషయములు చెప్పగలిగాడు. ఆయన చెప్పినవన్నీ, ఆనాడు భవిష్యత్తు విషయములే అయినా నేడు వర్తమానకాలములో సత్యమగు చున్నవి. అయితే జరిగిపోయిన కాలమును చెప్పడములో అందరూ అనుకున్నంత కష్టముండదని మేము అనుకుంటున్నాము. రేపు జరుగు దానిని నేడున్న పరిస్థితినిబట్టి ఊహించి చెప్పవచ్చును. అయితే ఎప్పుడో కొన్ని లక్షల సంవత్సరముల పూర్వము గడచిపోయిన దానిని గురించి ఎలా చెప్పనగును? అని కొందరు వారి భావమును వ్యక్తపరచవచ్చును. దానికి మేము చెప్పు సమాధానము ఈ విధముగా కలదు. కాలములు మూడు పేర్లతో గలవు. జరుగుచున్న కాలమును వర్తమానకాలము అని అంటున్నాము. జరుగబోవు కాలమును భవిష్యత్తు కాలము అంటున్నాము. జరిగిపోయిన కాలమును భూతకాలము అంటున్నాము. ఈ మూడు పేర్లలో రెండు పేర్లు పూర్వమున్నట్లే ఉన్నవి. అయితే ఒక్క పేరుమాత్రము కొద్దిగా మారిపోయి ఉన్నది. జరుగుచున్న కాలము బయటికి తెలియబడునదిగా ఉన్నది. అందరికీ వ్యక్తమయ్యే కాలము కావున జరుగుచున్న కాలమును **"వ్యక్తమాన కాలము"** అని అనెడివారు. ఆ పేరు కాలములో కొంత మార్పుచెంది చివరకు "వ్యక్తమాన" పోయి "వర్తమాన" అని పలుకబడు చున్నది. "వ్యక్త" అను పదములో 'త' మిగిలిపోయి 'య' వత్తు ఎగిరి పోయినది. అలాగే రెండవ అక్షరమైన "క్త" అను అక్షరములో 'క' ఎగిరిపోయి 'ర' వచ్చి చేరిపోయినది. క్రిందయున్న 'త' వత్తు అలాగే

మిగిలియుండుట వలన "వ్యక్త" అను పదము మారిపోయి "వర్త" అను పదముగా మిగిలిపోయినది.

ప్రస్తుత సమయములో తెలియుచున్న కాలమును పూర్వము వ్యక్త కాలము అనెడివారు, అదే పదమే నేడు వర్త అను శబ్దముగా మారిపోయినది. భగవద్గీతలో 2, 7, 8, 12 అధ్యాయములలో **"అవ్యక్త"** అను పదము చాలాచోట్ల ఉపయోగించి చెప్పబడినది. "అవ్యక్త" అనగా తెలియనిది అని అర్థము. దేవుడు అవ్యక్తుడు అని చెప్పుట వలన దేవుడు తెలియబడువాడు కాదు అని తెలియుచున్నది. ప్రస్తుతము జరుగుచున్న కాలమును **"వ్యక్త కాలము"** అనుటపోయి **"వర్తకాలము"** అంటున్నారు. జరిగిపోయిన కాలమును భూతకాలము అంటున్నారు. జరుగబోవు కాలమును భవిష్యత్తు కాలము అని అంటున్నారు. భవిష్యత్తు అను పదము వద్దగానీ, భూత అను పదమువద్దగానీ ఉపయోగించబడని 'మాన' అను పదమును 'వర్త' అనుచోట ఉపయోగించి వర్తమాన కాలము అంటున్నాము. 'మాన' అనగా కొలతయని అర్థము. జరుగుచున్న కాలము క్షణక్షణము విభజింపబడి తెలియుటవలన 'మాన' అను శబ్దమును ఉపయోగించి వర్తమాన కాలము అని అన్నారు. వాస్తవముగా ఆ పదమును వ్యక్త మానకాలము అని అనవలసియుంటుంది. అలా అంటే దానికి అర్థము సరిపోతుంది. ఇకపోతే జరిగిపోయిన కాలమును భూత కాలము అనడము జరుగుచున్నది. వాస్తవ అర్థము ప్రకారము ఈ పదము పూర్వమునుండి ఏమాత్రము మార్పుచెందక అలాగేయున్నదని చెప్పవచ్చును. భూతకాలము అనగా జీవమున్న కాలము అని చెప్పవచ్చును. భవిష్యత్తు కాలమును పుట్టబోయెడి బిడ్డతో సమానముగా పోల్చవచ్చును. వర్తమాన కాలమును

ప్రసవింపబడుచున్న బిడ్డతో సమానముగా పోల్చవచ్చును. భూతకాలమును పుట్టి ఊపిరిపోసుకున్న బిడ్డతో సమానముగా పోల్చవచ్చును.

**"జనన మరణ సిద్ధాంతము"** ప్రకారము గర్భస్థ శిశువుకు ప్రాణము లేదు. ప్రసవింపబడుచున్న శిశువుకు ప్రాణము లేదు. ప్రసవింప బడిన తర్వాత శిశువుకు ప్రాణము వచ్చుట సహజము. అందువలన రాబోయే భవిష్యత్తుకు ప్రాణములేదు. జరుగుచున్న వర్తమానమునకు ప్రాణములేదు. అయితే జరిగిపోయిన తర్వాత జరిగిన కాలమునకు ప్రాణము వస్తున్నది, దానికి జీవమున్నది. అందువలన జరిగిపోయిన కాలమును భూత కాలము అని తెలిసిన జ్ఞానులు పేరుపెట్టడము జరిగినది. భూతకాలము అనగా జరిగిపోయిన కాలమని అందరికీ తెలుసు. జరిగిపోయిన కాలము జీవముగలదైయున్న దానివలన దానికి తనలో గడచిన చరిత్రయంతయూ తెలుసు. భూతకాలమునకు తెలియని చరిత్రంటూ ఏదీలేదు. జరుగబోయేది తెలియదు, జరిగేది తెలుస్తున్నది. జరిగిపోయినది భూతకాలములో జీవమును కల్గిన భూతమునకు (జీవునకు) చరిత్ర అంతయూ తెలియును. **గడచిన కాలమునకు జీవమున్నదనుమాట గతములో ఎవరూ చెప్పనిమాట అయినందున,** నా మాటమీద మీకు నమ్మకము కుదరక పోవచ్చును. ఎవరికయినా ఈ విషయములో అలాగే అనిపించును. అయితే నమ్మినా నమ్మకపోయినా, నా మాటను నేను కూడా కాదనలేను. ఎందుకనగా అది ఇంతవరకు ఎవరికీ తెలియని సత్యము. జరిగిపోయిన భూతకాలము యొక్క భూతమును (జీవున్ని) వినయముగా అడిగితే, ఆ జీవుడు తనలో జరిగిపోయిన చరిత్రను తప్పక చెప్పును. ఎవడయితే జ్ఞానిగాయుండి తన స్వార్థమునకు కాకుండా,

లోకమునకు జ్ఞానమును తెలుపు నిమిత్తము అడిగితే, భూతకాలము యొక్క భూతము (జీవుడు) జ్ఞానిని చూస్తే సంతోషపడి తనలోయున్న చరిత్రను చెప్పగలడు.

భూతకాలమని పేరుపెట్టినంత మాత్రమున జరిగిపోయిన కాలములో జీవుడుండునా? యని కొందరు ప్రశ్నించగలరు. దానికి మా జవాబు ఈ విధముగా కలదు. భూతముల విషయములు తెలియబడ వని భగవద్గీతలో సాంఖ్యయోగమున 28వ శ్లోకమందు దేవుడు ఇలా అన్నారు. **"అవ్యక్తా దీని భూతాని" "భూతముల సంభవములు వ్యక్తము కావు"** అని చెప్పారు. భూతము అనగా జీవుడు శరీరములో ఎట్లు నివాసము చేయుచున్నదీ, ఏ జీవునికి ఏది శరీరముగాయున్నదీ, గ్రహములకు శరీరము ఎట్లుండునో, గోళముగాయున్న గ్రహములో జీవుడు ఎట్లుండునో తెలియక పోతే ఈ విషయము ఎవరికీ సులభముగా అర్థముకాదు. అందువలన జీవరాసుల విషయము సులభముగా వ్యక్తము కావు అని అన్నారు. ఇప్పుడు మేము చెప్పినది కాలముయొక్క భూతమును గురించి చెప్పాము. గతములో రోగములు కూడా భూతములేయని చెప్పాము. అప్పుడు రోగము ఒక భూతము అంటే మా మాట ఎవరూ నమ్మలేదు. రోగములో ప్రత్యేకించి క్యాన్సర్ ఒక భూతమనీ, ఎయిడ్స్ రోగము మరియొక భూతమనీ చెప్పాము. అలాగే జరిగిపోయిన కాలము కూడా ఒక భూతమేయని మేము చెప్పుచున్నాము. రోగము దైవజ్ఞాని మాట వినుననీ, ఆయన చెప్పినట్లు నడుచుకొనుననీ కూడా చెప్పాము. జ్ఞాని చెప్పినట్లు నడుచుకొని, రోగము ఒక వ్యక్తినుండి దూరముగా పోయినప్పుడు, ఆ వ్యక్తిమాట విన్నట్లే కదా! రోగముగాయున్న భూతము జ్ఞాని మాట విన్నప్పుడు, కాలముగాయున్న భూతము ఎందుకు మాట వినదు! అందువలన దైవజ్ఞాని గతచరిత్రలోని

విషయమును అడిగితే, భూతకాలము జ్ఞాని అయిన వ్యక్తికి గత చరిత్రలోని విషయములను తెలియజేయగలదు. **రోగము ఒక భూతము, మేఘము ఒక భూతము, భూతకాలము కూడా ఒక భూతమే.** అందువలన కాలమునకు భూతకాలము అని పేరు పెట్టారు. రోగభూతము జ్ఞాని అయిన మనిషి మాటవిని, జ్ఞానముమీద గౌరవముతో అతను చెప్పినట్లు నడుచుకోవడమైనది. అదే విధముగా మేఘము అను భూతము కూడా జ్ఞానిమాటను ఆలకించి, దాని ప్రకారము నడుచుకోవడము జరిగినది. కాలభూతము కూడా జ్ఞానిమాటను వినడము ఆ మాట ప్రకారము తనకు చేతనయినది చేయడము గలదు. ఆ భూతములకు దైవజ్ఞానము మీద ఎంతో గౌరవముండుట వలన వారు (భూతములు) జ్ఞానమున్న వానిని గౌరవించుచున్నారు. రేపు చనిపోతాడు అను రోగమున్న వాడు కూడా జ్ఞాని చెప్పిన మాటతో ఆ మనిషి నుండి రోగ భూతము దూరముగాపోయి, అతనిలో రోగము కనిపించకుండా పోవడము ఆశ్చర్యమే అయినప్పుడు, కాలభూతము తన చరిత్ర కాలములో జరిగిన విషయములను తెలియజేయును అని మేము అనడములో ఆశ్చర్యము లేదుకదా!

మేము చెప్పునది వినేదానికే విడ్డూరముగానేయున్నా అది ఎప్పటికీ సత్యముగానే ఉండును. భూతకాలములోని భూతము (జీవుడు) మాట్లాడదు గానీ, విషయమును పూర్తి తెలియజేయును. ఆ విధముగా తెలిసిన చరిత్ర విషయములనే మేము చెప్పుచున్నాము. భూతకాలములో బ్రాహ్మణులను గురించి అడిగితే వారితోపాటు వైశ్యులు కూడా తెలియుచున్నారు. ఒకవేళ వైశ్యులను గురించి అడిగితే వారితో సంబంధపడియున్న బ్రాహ్మణులు కూడా తెలియుచున్నారు. ఇంతకుముందు బ్రాహ్మణులు పురోహితులుగా ఎట్లు పిలువబడినారో, వైశ్యులు వర్తకులుగా ఏ విధముగా పిలువబడినారో

చెప్పుకొన్నాము. అప్పుడే కృతయుగములోనే కొంతకాలము గడచిపోగా బ్రాహ్మణుల, వైశ్యుల ఆధిపత్యపోరు అలాగే సాగుచుండెను. పురోహితులు అనబడువారు వర్తకులకంటే తమను గొప్పగా ప్రజలలో వర్ణించుకొనుచూ, తమను భూమిమీద కనిపించే దేవతలుగా తెలియునట్లు తమను "భూసురులు"గా చెప్పుకొనిరి. "సురులు" అనగా దేవతలు అని అర్థము. పురోహితులుగాయున్నవారు అంతటితో ఆగక తమను భూమిమీద తిరుగాడే దేవతలుగా చెప్పుకోగా, ఆ మాటను వినిన చంద్రవంశము వారయిన వర్తకులు తాము ఏమీ తక్కువలేము అన్నట్లు, మేము భూమిమీద యున్న ప్రజల అందరిలో శ్రేష్ఠులమని చెప్పుకొనిరి. **"శ్రేష్ఠి"** అనగా శ్రేష్ఠమైనవాడు అని అర్థము రాగలదు. అప్పుడు భూమిమీద తిరిగే దేవతలకంటే మేమే శ్రేష్ఠమైనవారమని తెలుపుచూ తమను తాము శ్రేష్ఠులుగా పరిగణించుకొని తమ పేరు చివర 'శ్రేష్ఠి' అను పదమును చేర్చి, ఎవరు తమను పిలిచినా చివరకు 'శ్రేష్ఠి' అని పలుకులాగున చేసిరి. దానితో బ్రాహ్మణులను ఎవరూ దేవతలని పిలువకున్నా వైశ్యులను మాత్రము అందరూ 'శ్రేష్ఠి' అని పిలుచుచుండిరి. బ్రాహ్మణులు తెలివిగా తమను దేవతలుగా చెప్పుకొనినా, కొందరు ప్రజలు వైశ్యులను శ్రేష్ఠి అను చున్నారుగానీ, బ్రాహ్మణులను ఎవరూ దేవతలని అనలేదు. దానితో బ్రాహ్మణులకంటే వైశ్యులే ఎక్కువ తెలివైనవారుగా ప్రజల లెక్కలో కనపడసాగిరి. ప్రజలు బ్రాహ్మణులకంటే వైశ్యులను ఎక్కువ వారిగా లెక్కించడము ఏమాత్రము సరిపోని భూసురులయిన బ్రాహ్మణులు, తమ ఆధిపత్యమును నిరూపించుకొనుటకు ప్రజల చేత పాదనమస్కారము చేయించుకొనుచుండిరి. అప్పటికీ పురోహితులు భూసురులుగా లెక్కించ బడకపోగా, వర్తకులను మాత్రము ప్రజలు శ్రేష్ఠులని పిలుచుచుండిరి.

అయితే వైశ్యులు అనబడే చంద్రవంశపు వర్తకులను దురదృష్టము వెంటాడగా వార్తకుడు అను పేరుపోయి వర్తకుడయి పోయినది. తర్వాత 'శ్రేష్ఠి' అను పేరుపోయి "శెట్టి" అయినది. నేటికినీ వైశ్యులను చాలామంది ప్రజలు శెట్టిగారు అని అనడము వినుచునే యున్నాము. బ్రాహ్మణులు తమకు పెట్టుకొన్న పేరు మారకున్నా, వైశ్యులు చెప్పుచున్న పేరు మాత్రమే మారిపోవుచున్నది. శ్రేష్ఠికి అర్థముంది గానీ శెట్టికి ఏమాత్రము అర్థములేదు. వైశ్యులు పెట్టుకొన్న పేర్లలో అన్ని పేర్లు మారిపోయినవి. బ్రాహ్మణులు పెట్టుకొన్న పేర్లూ మారకుండా అట్లేయున్నా, వైశ్యుల పేర్లుమాత్రము కాలక్రమమున చాలా మారిపోయినవి.

పూర్వము సూర్యవంశము వారు ఒక గుంపుగాయుండి వారే నేడు బ్రాహ్మణులుగా పిలువబడుచున్నారని చెప్పాము కదా! మొదట వారికి బ్రాహ్మణులను పేరు లేకుండెడిది. మేము పెద్ద జ్ఞానులము అనుటకు బ్రహ్మజ్ఞానులము అని సూర్యవంశము వారు పేరు పెట్టుకోవడము జరిగినది. బ్రహ్మ అనగా పెద్దయని అర్థముండుట వలన, ఒకప్పుడు చంద్రవంశము వారికంటే తాము గొప్ప అన్నట్లు గుర్తింపుగా వారు బ్రహ్మజ్ఞానులు అను పేరు పెట్టుకొని, మేము పెద్ద జ్ఞానులమని బయటికి తెలియునట్లు చేశారు. అంతవరకు వార్తకులుయని ఒకమారు, శ్రేష్ఠులమని ఒకమారు ప్రకటించు కొన్న చంద్రవంశము బోధకులు, మూడవమారు సూర్యవంశము వారు చేసిన ప్రయోగమునకు ధీటుగా, తాము కూడా కొంత పేరు మార్పు చేసి వారికంటే గొప్పగా కనిపించాలని అనుకొన్నారు. ఇట్లు ఒక తరహా యుద్ధములాగా జరుగు ఈ కార్యక్రమములలో తాము సూర్యవంశము వారని వీరు, తాము చంద్రవంశము వారమని వారు పూర్తి మరచిపోయి, అప్పుడు ప్రకటించుకొన్న పేర్లనే ముఖ్యముగా చెప్పుకొనుచుండిరి.

ఒకమారు గొప్ప అర్థమున్న పేరును వారు ప్రకటించుకొంటే అదే పేరుతోనే వేయి లేక రెండు వేల సంవత్సరములు చలామణి అయ్యేవారు. తర్వాత ఒకరికంటే మరొకరు ముందుకు పోవాలను ఉద్దేశ్యముతో తమ పేర్లను ఇంకా గొప్ప అర్థముతో చెప్పుకొనెడివారు. ఆ ప్రయత్నములో నేడు బ్రాహ్మణులు అనబడేవారే మొదటి ప్రయత్నము చేయగా, తర్వాత వైశ్యులుగా చెప్పబడువారు వారికి ధీటుగా స్పందించుచూ, వారు కూడా తగిన పేరును తగిలించుకొనెడివారు. మూడవమారు బ్రహ్మజ్ఞానులము అని సూర్యవంశమువారు పెట్టుకోగా, చంద్రవంశమువారు మేము వారికంటే తక్కువకాదు అన్నట్లు "గుప్త జ్ఞానులము" అని చెప్పుకోవడము జరిగినది. వారు ఆ విధమైన పేరు పెట్టుకోవడమునకు కారణము ఏమంటే?

దేవుడు అంటే ఎవరికీ తెలియనివాడు అని చెప్పవచ్చును. దానినే **"దేవులాడబడేవాడు దేవుడు"** అని కూడా అన్నారు. దేవులాడ బడడము అనగా వెతుకులాడడము అని అర్థము. వెతికినా దొరకని రహస్యమైనవాడు దేవుడు అని మనము ఆధ్యాత్మిక గ్రంథములనుండి తెలుసుకొన్నాము. రహస్యమును గుహ్యము అని కూడా అనవచ్చును, దేవుడు గుహ్యమైన వాడు, ఆయన జ్ఞానము గుహ్యమైనది, కావున భగవద్గీతలో దేవుని జ్ఞానమును గురించి రహస్యములలోకెల్ల పెద్ద రహస్యమైనది అని చెప్పుచూ "రాజగుహ్య" అని అన్నారు. రాజ అంటే అన్నిటికంటే పెద్దయనీ, రాజగుహ్య యంటే పెద్ద రహస్యమైనదని చెప్పారు. ప్రపంచములో పెద్ద రహస్యము దేవుడు, దేవుని జ్ఞానము తప్ప ఏమీ లేదు. అందువలన మేము గుప్త జ్ఞానులమని చంద్రవంశము బోధకులు చెప్పుకోవడము జరిగినది. బ్రహ్మ జ్ఞానులము (పెద్ద జ్ఞానులము) అని నేటి బ్రాహ్మణులుగాయున్నవారు ఆనాడు తామే పెద్దయని వారి పేరును ప్రకటించుకోగా, దానికి ధీటుగా

స్పందించిన నేటి వైశ్యులుగాయున్నవారు ఆనాడు గుప్త జ్ఞానులము అని చెప్పుకొనిరి. దానితో ఇరువైపు బోధకులకు ఒక్కొక్కరికి మూడు పేర్లు వచ్చి చేరిపోయినవి. సూర్యవంశ బోధకులు పౌరోహితులు, భూసురులు, బ్రహ్మజ్ఞానులు అను మూడు పేర్లతో చలామణి అగుచుండిరి. చంద్రవంశపు బోధకులు కూడా ఎదుటివారికి సాటిగా వార్తకులు, శ్రేష్ఠులు, గుప్తజ్ఞానులు అను పేరుతో చలామణి అగుచుండిరి. ఈ విధముగా వారు మూడు పేర్లతో గొప్ప జ్ఞానమును తెలుపువారిగా ప్రకటించుకొన్న తర్వాత, వారిలో జ్ఞానమును బోధించడము తగ్గిపోయినది. చివరకు వారిపేర్లకు వారే అర్థము తెలియని స్థితిలోనికి పోయారు. సూర్యవంశము, చంద్రవంశము అను మాటలను వారు ముందే మరచిపోయారు.

ప్రజలకు జ్ఞానము చెప్పుట మా పనియని తెలియకుండాపోవు స్థితికి దగ్గరగాయున్న సమయములో చంద్రవంశ వైశ్యులలో సూర్యవంశము వారికి మేము పోటీగాయున్నాము అను జ్ఞప్తి కొద్దిగా ఉండెడిది. బ్రాహ్మణులుగా యున్నవారు బోధలు చెప్పేది పూర్తిమానుకొన్నవారై మొదట తమపని ఇది ఉండేదని కూడా తెలియకుండా పోయారు. చివరిలో అంతో ఇంతో జ్ఞాపకముండి బ్రాహ్మణులకంటే తాము ఇంకా గొప్పవారమనిపించు కోవాలనుకొన్నవారు వైశ్యులే. 'వైశ్యులు' అను పేరు మధ్యలో ఇతరులు పెట్టిన పేరుగానీ అది వారు పెట్టుకొన్నపేరు కాదు. ఇరువైపుల బోధకులు చివరిలో తమకు తాము పెట్టుకొన్నపేర్లు, బ్రహ్మజ్ఞానులము అని ఒక గుంపువారు, గుప్త జ్ఞానులమని మరియొక వైపువారు అనుకోవడము జరిగినది. అయితే కొంతకాలమునకు అనగా కొన్ని వేలసంవత్సరములకి వారి చివరి పేర్లలో కొంత మార్పువచ్చినది. 'బ్రహ్మజ్ఞానులు' అను పేరు చివరకు బ్రాహ్మణ అని మారిపోయినది. 'గుప్త జ్ఞానులు' అను పేరు గుప్త

అని చెప్పబడినది. రెండు పేర్లు బ్రాహ్మణులు, గుప్తులని పిలువబడగా మొదట తమకు ఆ పేరు ఎందుకు వచ్చినది? అని యోచించలేని స్థితిలో ఇరువైపులవారు మిగిలిపోయారు. ఇది ఇప్పటి పరిస్థితికాగా పూర్వము బ్రాహ్మణులు తమకు వైశ్యులకు మధ్యలో ఆధిపత్య పోరు కలదనుమాటను మరచిపోయారు. అయితే చివరగా వైశ్యులకు ఇంకా ఆ జ్ఞాపకముండుట వలన చివరిగా తామే ముందడుగు వేసి తమ పేరును శాశ్వితముగా బ్రాహ్మణులకంటే మిన్నగా ఉండునట్లు, వారికంటే జ్ఞానములో తామే పెద్దగా యున్నామనునట్లు, తమపేరును మరొకమారు జ్ఞానముతో సంధానము చేసి చెప్పుకొన్నారు. ప్రతిమారు ముందు బ్రాహ్మణులు తమ పేరును క్రొత్తగా చెప్పుకోగా తర్వాత దానికి ధీటుగా వైశ్యులు తమ పేరును మార్చి చెప్పెడివారు. అయితే చివరిలో బ్రాహ్మణులు తమ చూపును బోధలవైపు నుండి మళ్ళించి ప్రపంచ ధనాపేక్షలో పడిపోగా, చివరిలో వైశ్యులు మాత్రము కొంత పాత స్పృహను కల్గియుండి చివరిలో తాము రెండు పేర్లను మార్చుకోవడము జరిగినది.

మార్చుకోవడము అనగా ముందున్న పేరును పూర్తిగా తీసివేసి క్రొత్త పేరును పెట్టుకోవడముకాదు. ముందున్న పేరును అట్లే యుంచుకొని జ్ఞానములో గొప్ప భావమున్న పేరును పెట్టుకోవడమని తెలియవలెను. ఆ విధముగా బ్రాహ్మణులు మూడు పేర్లు కలిగియుండగా, వైశ్యులు ఐదు పేర్లు కలిగియున్నారు. ఐదు పేర్లు దైవజ్ఞానముతో ముడిపడియుండడము విశేషము. బ్రాహ్మణులు కూడా తమకు తాము పెట్టుకొన్న మూడు పేర్లను జ్ఞానముతో ముడివేసి పెట్టుకోగా, చివరికి వాటి అర్థమును వారు, వీరు ఇరువురూ మరచిపోయారు. వైశ్యులు, బ్రాహ్మణులకంటే తెలివైనవారు అనుటకు గుర్తుగా వైశ్యులు ఐదు పేర్లను బిరుదులుగా కల్గియున్నారు.

అటువంటి పేర్లలో నాల్గవ పేరు **"కోముట"**, ఐదవపేరు **"వ్యాపరి"**. ఈ రెండు పేర్లలో నాల్గవ పేరయిన కోముటలో దైవజ్ఞానము ఏముందో కొద్దిగా వివరించుకొని చెప్పుకొందాము. ఈ పేరును వైశ్యులు ఉంచుకోవడము వలన బ్రాహ్మణులకంటే మించిన జ్ఞానులు వైశ్యులనియే తెలిసిపోవుచున్నది.

దేవుడు భగవద్గీతలో చెప్పినట్లు, బైబిలులో మరియు ఖుర్ఆన్‌లో చెప్పినట్లు మూడు ఆత్మల రూపములోయున్నాడు. భగవద్గీతలో **క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడని** మూడు విధముల పురుషోత్తమప్రాప్తి యోగములో చెప్పియుండగా, ఖుర్ఆన్ గ్రంథములో సూరా 50, ఆయత్ 21లో **త్రోలబడేవాడు, త్రోలేవాడు, సాక్షిగా చూచేవాడు** అని మూడు రకములుగా చెప్పబడియున్నాడు, అట్లే బైబిలు గ్రంథములో మత్తయి సువార్త 28వ అధ్యాయములో 19వ వాక్యములో **తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మయని** ముగ్గరిగా చెప్పబడినాడు. మూడు దైవగ్రంథములలో దేవుడు మూడు భాగములుగా ఉన్నాడని చెప్పడము జరిగినది. దేవుడు చెప్పిన జ్ఞానములో దేవుడు ఈ విధముగా ఉన్నాడని తెలిపినట్లు, వైశ్యులు కూడా తమ పేరును దేవునికి దగ్గరిగాయుండు అర్థముతో "కోముట" అని చెప్పుకొన్నారు. "కోముట" అను మూడు అక్షరములు ప్రత్యేకత కల్గియుండి, భగవద్గీతలో దేవుడు చెప్పినట్లు మూడు ఆత్మలకు గుర్తుగాయున్నవి. "కో" అనగా జీవాత్మకు గుర్తని, "ము" అనగా ఆత్మకు గుర్తని, "ట" అనగా పరమాత్మకు గుర్తని చెప్పవచ్చును. అంతేకాక జీవుడు ఆడుచుండగా, ఆడించువాడు ఆత్మ అయివుండుటవలన, ఆ రెండు ఆత్మలను ప్రత్యేకించి చెప్పు రెండు అక్షరములతో 'కో' అని 'మ' అని చెప్పడము జరిగినది. 'క' అను అక్షరమునకు ఓత్వము కలిపితే "కో" అయినది. అలాగే 'మ' అను అక్షరమునకు ప్రక్క కొమ్ము కలిపితే 'ము' అయినది. చివరిలోని అక్షరము

ఏదీ కలియక వుండు "ట" అక్షరముగాయున్నది. ఓత్వము, కొమ్ము కలిసిన రెండు అక్షరములలో "కో" జీవాత్మకు గుర్తని, "ము" ఆత్మకు గుర్తని చెప్పుకొన్నాము. జీవుడు ఆత్మ రెండు అవినాభావ సంబంధముకల్గి, ఒకటి ఆడించుచుండగా మరొకటి ఆడుచున్నది. అందువలన ఆ రెండు ఆత్మలకు గుర్తుగా కొమ్ము కలిసినది, ఓత్వము కలిసినది అయిన "కో", "ము" ను గుర్తుగా చెప్పడము జరిగినది.

పరమాత్మయను దేవుడు ఏమీ చేయక శరీరములో సాక్షిగా చూస్తూ ఊరక యుండుట వలన ఆయనకు కొమ్ముగానీ, దీర్ఘముగానీ ఓత్వముగానీ లేని ఏకాక్షరము అయిన 'ట' ను దేవుని గుర్తుగా ఉంచడమైనది. జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను భగవద్గీతలోని పురుషోత్తమప్రాప్తి యోగమునగల మాటను చూపునట్లు, గుర్తు చేయునట్లు, "కోముట" అని తమను తాము చెప్పుకొన్నారు. 'కోముట' అనగా మూడు ఆత్మల జ్ఞానము తెలిసినవారమను అర్థము వచ్చుచున్నది. అంతగొప్ప భావముతోయున్న 'కోముట' అను పదములో మరియొక రహస్యము దాగియున్నట్లు తెలియుచున్నది. ఆ రహస్యము ఏమనగా! దేవుడు మూడు ఆత్మలుగాయున్నాడను విషయము ప్రతి ఒక్కరూ గ్రహించునట్లు, తమ పేరులో కనపడని రహస్యమును కూడా ఉంచాడు. ఆ కనపడని రహస్యము కొంత శ్రద్ధకలవారికే తెలియునట్లు అందులో ఆ మూడు అక్షరములలో ఉండునట్లు చేశారు.

మూడు అక్షరములలో కనిపించక దాగియున్న మూడు ఆత్మల వివరము ఇలా కలదు. 'కో' అను అక్షరములో మూడు కొనలు గలవు. ఆ మూడు కొనలను మూడు ఆత్మలగుర్తుగా చెప్పవచ్చును. ప్రక్క పేజీలో యున్న పెద్ద అక్షరములలో మూడు కొనలను చూస్తాము.

"కోముట" అను మూడక్షరములు మూడాత్మల గుర్తుకాగా, అందులోని ప్రతి అక్షరము మూడు ఆత్మలను తెలియజేయునట్లు మూడుకొనలు కల్గి యున్నవి. ప్రతి అక్షరము మూడు కొనలతో మూడు ఆత్మల జ్ఞాపకము చేయు ఉత్తమ పదమును, ఎంతో జ్ఞాన రహస్యముతో కూడిన మూడక్షరముల పదమును, పూర్వము చంద్రవంశ బోధకులు తమ పేరుగా పెట్టుకోగా, కాలక్రమేపీ ఆ పదములోకూడా కొంత మార్పువచ్చి నేడు ఆ పదము 'కోమటి' అనుపేరుతో పిలువబడుచున్నది. కోమటి వాళ్ళు అని నేడు వారిని సంబోధించడము జరుగుచున్నది. అయితే మారిన పేరులో పూర్తి దేవుని అర్థము లేకుండాపోయినది. ఎంతో విలువైన పేరు పెట్టుకొన్న వైశ్యులు ఆనాడు ఇతరులకు దేవుని జ్ఞానమును బోధించువారయినా నేడు తమ జ్ఞానమును మరచిపోయారు. చివరకు తాము పెట్టుకున్న తమ పేర్లకే అర్థము తెలియకుండా పోయారు. చివరకు వారి పేరే వారు తప్పుగా చెప్పుకొంటున్నారు. నేడు గడచిపోయిన చరిత్రలోని పెద్ద రహస్యములయిన వారి పేర్లకు మేము అర్థమును చెప్పినా గ్రహించు కోకుండా, మీరు చెప్పునది నిజమని మేము ఎలా నమ్మాలి? మా జ్ఞానము మాకు తెలియదని మీరు అన్నప్పుడు, మా జ్ఞానము మీకు ఎలా తెలిసింది? మీరు కల్పన చేసి చెప్పు మాటలను మేమెందుకు నమ్మాలి? అని అంటే దానికి నేను ఏమీ చెప్పక మౌనముగా ఉండగలను. నా మాటలను విశ్వసించువారికి మాత్రము నేను చెప్పినది నూటికి నూరు పాళ్ళు సత్యము అయినా **"నా మాట సత్యమని మీరు నమ్మండి"** అని నేను ఎవరికీ చెప్పడము లేదు.

కాలగర్భములో ఎన్నో విషయములు కనుమరుగైపోయాయి. కొన్ని విషయములు మాత్రము కొంత గుర్తింపుగా, కొంత నమూనా గుర్తులుగా

నిలిచియున్నవి. అటువంటి నమూనా గుర్తులను చూచి వెనుకటి కాలములో ఏమి జరిగినదో కొంతవరకు తెలియవచ్చును. ఇంతవరకు మేము చెప్పిన విషయములను నమ్మనివారు కూడా ఉండవచ్చును. అయితే మేము ఈ విషయములను కల్పన చేసియో, ఊహించుకొని చెప్పుటయో చేయలేదు. భూతకాలములోయున్న భూతము ద్వారా నేను తెలియగలిగిన విషయములనే చెప్పాము. ప్రపంచములో ఎవరూ **"భూతకాలము చరిత్రలోని విషయములను చెప్పింది"** అనుమాటనే చెప్పలేదు. భూతకాలములోని భూతము చెప్పడము ఏమిటి? అని కొందరు ఆశ్చర్యమును వ్యక్తము చేయవచ్చును. గతములో మేము రోగముల భూతములకు చెప్పిన మాటలను వారు (రోగములు) విని ఇతరుల శరీరములో లేకుండా పోయారని చెప్పినా, అది కూడా నమ్మలేని మాటగానేయుండును. లక్షలు ఖర్చు చేసినా నయము గాని రోగములు, ఏమాత్రము శరీరమును వదలిపోని క్యాన్సర్, ఎయిడ్స్ మొదలగు రోగములు మా మాటను గౌరవించి చెప్పినట్లు విన్నప్పుడు, కాలములోని భూతము నాకు ఎందుకు గౌరవమును ఇవ్వదు? నాకు గత చరిత్రను ఎందుకు తెలుపదు? దేవుని జ్ఞానమును శరీరములో జీర్ణింపజేసుకొన్న ఎవనిమాట నయినా జ్ఞానముగల భూతములు గౌరవించును. దేవుని పరిపాలనలో భాగస్వాములయిన భూతములన్నీ నీవు దేవుని జ్ఞానమును తెలియగల్గితే నిన్ను కూడా గౌరవించును, నీ మాటను కూడా వినునని చెప్పుచున్నాము.

త్రేతాయుగములో త్రికాల జ్ఞాని, అపరబ్రహ్మ అయిన రావణబ్రహ్మ ఎంతో జ్ఞానశక్తికలవాడై కాలములోని ద్వాదశ గ్రహములను తన మాటను వినునట్లు చేసుకొన్నాడు. ఆనాడు ఆయనలోయున్న జ్ఞానమునుబట్టి గ్రహములు కూడా ఆయన మాటను వినగలిగాయి. అప్పటికాలములో

జ్ఞానములో జ్ఞానశక్తిలో మిన్నగాయున్న ఆయన లంకానగరమును రోగము లన్నియూ వదలిపోవునట్లు చెప్పగా, భూతములయిన రోగములన్నియూ లంకేశ్వరుడయిన రావణబ్రహ్మ మాటను గౌరవించి లంకానగరమును వదలిపోవడము జరిగినది. ఈ మాటలను చెప్పితే అది జరిగిపోయిన కాలము. అప్పుడు అది జరిగిందో, లేదో! మీ మాటను మేము ఎలా నమ్మాలి?యని కొందరనవచ్చును. అప్పుడు జరిగిన దానికి ఇప్పుడు సాక్ష్యాలను చూపాలంటే మాకు కూడా కష్టమే. అందువలన జ్ఞానము గొప్పయని చెప్పుటకు ఇంతవరకు మేము ఎవరికీ చెప్పని విషయములను చెప్పవలసివచ్చినది. రోగములు భూతములని చెప్పుటకు, **"భూతములు జ్ఞానుల మాటను గౌరవించును"** అని చెప్పుటకు మీకు కావలసిన సాక్ష్యము మేమేయనియూ, మా ద్వారా రోగములనుండి బయట పడిన వందలాదిమంది మనుషులు సాక్ష్యమని చెప్పుచున్నాము. ఇంకా చెప్పాలంటే మాచే వ్రాయబడిన గ్రంథములే జ్ఞానశక్తికి, భూతముల గౌరవమునకు సాక్ష్యమని చెప్పుచున్నాము. మాచే వ్రాయబడిన ఏ గ్రంథమయినా జ్ఞానశక్తితో నిండి నిభిడీకృతముగాయుండును. మా గ్రంథమును ఎవరు గౌరవించి వినయముతో, భక్తిభావముతో దగ్గరుంచుకున్నా వారిలోని రోగ భూతములు మా గ్రంథములను గౌరవించి, మనుషుల శరీరములకు అంటుకొనిపోవుచున్నవి. శరీరములోని రోగ భూతములు కూడా మా గ్రంథములను క్రిందపడకుండా గౌరవముగా పట్టుకొని, గ్రంథములను గౌరవించడము జరుగుచున్నది. ఇదంతయూ చెప్పితే నమ్మలేని విషయమైనా కంటితో ప్రత్యక్షముగా చూచినప్పుడయినా అందరూ తప్పక నమ్మి తీరవలసిందే.

ఏ కాలములో అయినా జ్ఞానము ఒకటే, జ్ఞానశక్తి ఒక్కటే వుండును. కావున ఈ కాలములో కూడా దేవుని జ్ఞానమును ఎవరయినా తెలియ వచ్చును, దైవశక్తి అనబడు జ్ఞానశక్తిని పొందవచ్చును. పూర్వము ఎందరో జ్ఞానశక్తి కల్గినవారుండెడివారు. అటువంటి వారిలో బ్రహ్మవిద్య అయిన దైవజ్ఞానమును బాగా తెలిసిన రావణబ్రహ్మ మొదటివారని చెప్పవచ్చును. అయితే నేటి కాలములో జ్ఞానమేదో, అజ్ఞానమేదో తెలియని మనుషులు మహాజ్ఞాని అయిన రావణబ్రహ్మను అజ్ఞానిగా, దుర్మార్గునిగా, ఇంకా నీచముగా పోల్చుకొన్నారు. అటువంటి వారికి చరిత్ర తెలియదు. కావున ఇతరులు చెప్పిన మాటలువిని దైవజ్ఞాని అయిన రావణబ్రహ్మను అజ్ఞానిగా లెక్కించుకొన్నారు. కొన్ని విషయములలో అనగా ధర్మాధర్మముల విషయములో మాకు అనుమానమువచ్చి మనుషుల మాటలను వినకుండా చరిత్రను చూచి తెలుసుకొంటే, రావణబ్రహ్మ మనుషులు అనుకొన్నట్లు చెడ్డవాడుకాదనీ, ఆయన చాలా దొడ్డవాడు అని తెలిసింది. భగవద్గీతలో దేవుడు చెప్పిన జ్ఞానము ప్రకారము అధర్మముల జాబితాలోనికి యజ్ఞములు వెళ్ళిపోయాయి. **వేదముల అధ్యయనములు, దానములు, తపస్సులు, యజ్ఞములు నాలుగు అధర్మములని భగవద్గీత తేల్చి చెప్పినది.** నా మాటను నమ్మలేకపోతే భగవద్గీతలోని విశ్వరూప సందర్శనయోగము అను అధ్యాయమున 48 మరియు 53 శ్లోకములను గమనించితే ఈ విషయము తెలియగలదు. **భగవద్గీతలో చెప్పిన కర్మ, బ్రహ్మ, భక్తి యోగములను మూడు యోగములు, మూడు ధర్మములుగా యున్నవి. వేదాధ్యయన, యజ్ఞ, దాన, తపస్సులు నాలుగు అధర్మములుగాయున్నవి.**

రావణబ్రహ్మ త్రేతాయుగములోనే, ద్వాపరయుగములో కృష్ణుడు చెప్పిన జ్ఞానము ప్రకారము అధర్మములను ఖండించి చెప్పడము, అధర్మ

ఆచరణ ఎక్కడయినా ఆచరించువారుంటే, వారిని వ్యతిరేఖించి వారి ఆచరణలను భంగము చేయుచూ, దేవుని ధర్మములను పరిరక్షించడము చేయుచుండెను. తన రాజ్యములోగానీ, తన రాజ్యమునకు చుట్టు ప్రక్కల ఎక్కడయినాగానీ అధర్మాచరణయుంటే దానిని తీవ్రముగా ఖండించేవాడు. ఆ నేపథ్యములోనే దక్షిణ భారతదేశమున జరుగు యజ్ఞములను భంగము చేశాడు. ఒకప్పుడు జ్ఞానమంటే ఏమిటో తెలియని స్థితిలో రావణబ్రహ్మ చేసినది తప్పని అనుకొనేవారము. అయితే దేవుని జ్ఞానము తెలిసిన తర్వాత, భగవద్గీతలోని జ్ఞానమును ధర్మములను తెలిసిన తర్వాత రావణబ్రహ్మ చేసినది తప్పుకాదని, ఆయన దేవుని ధర్మములను కాపాడి అధర్మములను మనుషులనుండి దూరము చేయాలను ఉద్దేశ్యముతో ఆనాడు యజ్ఞములను భంగము చేశాడని తెలుసుకొన్నాము. త్రేతాయుగములో దేవుని జ్ఞానము ప్రకారము నడుచుకోవడమేకాక, దేవుని జ్ఞానమును ప్రత్యక్ష ఆచరణ చేసి చూపించినవాడు రావణబ్రహ్మ. అంతటి వానియొద్ద ఎంతో జ్ఞానశక్తియుండెడిది. ఆయన జ్ఞానమును, జ్ఞానశక్తిని చూచిన దేవుని పాలనలోని భూతములన్నీ ఆయనను గౌరవించి, ఆయనమాటను ఆలకించి, ఆయన మాటప్రకారము నడుచుకొన్నాయి. తాను లంకలో యున్నంతవరకు తన పట్టణములో రోగభూతముల ద్వారా వచ్చిన రోగములన్నీ లేకుండా పోవలెనని, తన అనుమతి లేకుండా క్రొత్త రోగము ఏదీ తన రాజ్యములో ప్రవేశించకూడదని చెప్పగా, ఆయన మాటను గౌరవించి భూతములన్నీ అట్లే ఆచరించాయి.

జ్ఞానమును బోధించు రెండు గుంపుల వారిలో వైశ్యులు అనబడు వారు బ్రాహ్మణులకంటే జ్ఞానము పేర్లలో రెండు పేర్లు ఎక్కువ కల్గినవారని చెప్పుకొన్నాము. అందులో "కోముట" అను పేరు తెలిసిపోయినది. తర్వాత

కొన్ని వందల సంవత్సరములు గడచిన పిమ్మట, జ్ఞానముతో కూడిన మరియొక పేరును పెట్టుకొని అలాగే ప్రజలచేత పిలిపించుకొనెడివారు. అప్పుడు వారికి తెలిసిన జ్ఞానముతో దేవుడు సర్వ ప్రపంచమంతా అణువణువునా వ్యాపించియున్నాడని గ్రహించగలిగారు. దేవుడు సర్వ జీవరాసుల శరీరములందేకాక శరీరముల బయట శూన్యమునందు కూడా వ్యాపించి తానులేని జాగాలేదని భగవద్గీతలో చెప్పినట్లు కలడని వారు ప్రజలకు బోధించెడివారు. అప్పటి కాలములో **"దేవుడు సర్వవ్యాపకుడు"** అని తెలిసినవారైయుండిరి. దేవుని జ్ఞానమును, దేవుడు సర్వము వ్యాపించిన విధానమును శాశ్వితముగా జ్ఞాపకముండునట్లు, ఎల్లప్పుడూ గుర్తుగా యుండునట్లు, దానికి సంబంధించిన పేరును పెట్టుకోవాలనుకొన్నారు. చివరకు **"వ్యాపరి"** అను పేరును తమకు పెట్టుకోవడము జరిగినది. వ్యాపరి అనగా **'సర్వమూ వ్యాపించినవాడు'** అని అర్థము. ఈ విధముగా చంద్రవంశ బోధకులు సూర్యవంశ బోధకులకంటే కొంత ముందంజవేసి వారికంటే తమకే ఎక్కువ పేర్లుండునట్లు, ఆ పేర్లన్నీ దేవుని జ్ఞానమునకు సంబంధపడియుండునట్లు పెట్టుకోవడము జరిగినది. ఆ విధముగా వారు పెట్టుకొన్న పేర్లలో మొదటిది వార్తకుడు, రెండవది శ్రేష్ఠి, మూడవది గుప్త జ్ఞానులు, నాల్గవది కోముట, ఐదవది వ్యాపరి. ఈ విధముగా వారు దైవజ్ఞాన సారాంశముతో కూడుకొన్న పేర్లు పెట్టుకోవడము జరిగినది. ఆనాటి ప్రజలు ఆ పేర్లయొక్క అర్థము తెలిసి, ఆ పేర్లతోనే పిలిచెడివారు.

"తాను ఒకటి తలిస్తే మాయ మరొకటి తలచిందని" పెద్దలు చెప్పినట్లు, వారు ఎంతో సారాంశముతో కూడుకొన్న పేర్లను జ్ఞానము గుర్తుండునట్లు పెట్టుకొన్నా, కొంతకాలమునకు అవి కొంత మార్పుచెంది వేరు విధముగా అర్థములేనివై పలుకబడెడివి. చంద్రవంశము వారు

పెట్టుకొన్న మొదటి పేరు "వార్తకుడు" కాగా అదికాస్తా కాలక్రమములో మార్పుచెంది **'వా'** కు యున్న దీర్ఘము పోయి చివరకు **"వర్తకుడు"** అయినది. తర్వాత రెండవ పేరు "శ్రేష్ఠి" కాగా అదికాస్తా కాలగర్భములో కలిసిపోయి "శెట్టి" అయినది. మూడవ పేరు ఎంతో తెలివిగా "గుప్త జ్ఞానులు" అని చెప్పుకోగా అందులో కొంత భాగముపోయి, కొంత భాగము మాత్రము మిగిలి "గుప్త" వరకు ఉండిపోయినది. నాల్గవమారు గొప్ప జ్ఞానమును ఉపయోగించి భగవద్గీతలో చెప్పిన మూడు ఆత్మల విషయము అందరికీ తెలియునట్లు తమ పేరులో ఉండవలెనను ఆశతో **"త్రైత సిద్ధాంతము"** వారి పేరులో కనపడునట్లు "కోముట" అని మంచి పేరును పెట్టుకోగా, మాయా ప్రభావము వలన మనుషులకు తెలియకుండానే ఆ పదమును పలుకడములో నోరు తిరుగక చివరకు "కోమటి" గా పిలువ బడినది. చివరిలో దేవుడు ప్రపంచమంతా వ్యాపించియున్నాడని అందరికీ తెలుపునిమిత్తము, **"దేవుడు సర్వవ్యాపి"** అని గుర్తుండునట్లు తమ పేరులో ఆ అర్థము ఇమిడియుండవలెనని, ఎంతో జ్ఞానముతో కూడుకొన్న పేరుగా "వ్యాపరి" అని నామకరణము చేసుకోగా, కాలగమనములో అదికాస్తా మారిపోయి చివరకు "వ్యాపారి" గా తయారైపోయినది.

మొదటి పేరయిన **వార్తకుడు**లో (వా) కు దీర్ఘము పోయి వర్తకుడుగా మిగిలిపోయినది. చివరి పేరయిన **వ్యాపరి** లో రెండవ అక్షరమయిన (ప) కు దీర్ఘము చేరి "వ్యాపారి" అని అనడము జరిగినది. ఈ రెండు పేర్లలో ఒకచోట దీర్ఘము పోయినందున పదములోని భావము మారిపోయినది. మరియొకచోట లేని దీర్ఘము వచ్చి చేరుట వలన భావము చెడిపోయినది. మొదట చివరి పేర్లలో ఒక అక్షరము పూర్తి మారకుండా, ఉన్న అక్షరమునకే లేనిది చేరడము, ఉన్నది పోవడము వలన పదములోని

భావములు మారిపోయి అసలయిన అర్థము మరుగున పడిపోయినది. మూడవ పేరు **"గుప్త జ్ఞానులు"** అని ఉండగా దానిలో మార్పులు చేర్పులు జరుగలేదు గానీ, ఉన్న రెండు భాగముల పదములో సగభాగము మిగిలిపోయి, సగభాగము లేకుండా పోయినది. గుప్త జ్ఞానులలో "గుప్త" మిగిలిపోయి "జ్ఞానులు" లేకుండా పోయినది. అప్పుడు గుప్త అను పదముయొక్క అర్థమయిన **"రహస్యము"** అనుమాట మాత్రము తెలియు చున్నది. అయితే ఏ రహస్యము అనునది అక్కడ లేదు కావున ఆ పదము అర్థహీనమైపోయినది. "వార్తకుడు" తర్వాత చంద్రవంశ బోధకులకు అనగా ఇప్పుడు వైశ్యులు అని పిలువబడు వారికి "శ్రేష్ఠి" అను పేరు చెప్పబడినది. మనుషులలో శ్రేష్ఠమయినవాడు, జ్ఞానములో శ్రేష్ఠమయిన జ్ఞానముకలవాడు అని అర్థమున్నా, అది మాయా ప్రభావము చేత "శ్రేష్ఠి" అను పదములో యున్న రెండు అక్షరములు మారిపోయి "శెట్టి" అను పదముగా మిగిలిపోయినది. దానితో శ్రేష్ఠులు అను మాట పోయి శెట్టిగారు అని ప్రజలు పిలువడము మొదలుపెట్టారు. ఈ విధముగా శెట్టి అను అర్థహీనమైన పదము వచ్చి తగులుకోవడము జరిగినది. అట్లే "కోముట" అను పేరును ఎంతో జ్ఞానముతో కూర్చబడి పెట్టినదికాగా, అందులో మూడు ఆత్మల వివరము పొదిగియుండగా, చివరకు మనుషులలోని అజ్ఞానము ఆ పదమును కూడా మార్చి "కోమటి వాళ్ళు" అనునట్లు చేసినది.

సూర్యవంశ బోధకులయిన బ్రాహ్మణులు **పొరోహితులు, భూసురులు, బ్రహ్మాజ్ఞానులు** అను మూడు పేర్లవద్ద నిలచిపోయి జ్ఞానబోధల మీద ఆసక్తి లేనివారై తమ పనులయందు తాముపుండగా, చంద్రవంశ బోధకులు తమను ఐదు పేర్లతో ప్రజలు పిలుచునట్లు చేసుకొని బ్రాహ్మణుల

కంటే బుద్ధిలో గొప్పవారిగా ప్రకటించుకొన్నారు. కోమటివారంటే తెలివైన వారను పేరు తెచ్చుకొన్నారు. సమాజములో కోమటివారని, శెట్టిగారని పిలువబడు వారు తమకంటే గొప్పగా రెండు పేర్లు ఎక్కువ పెట్టుకోవడము బ్రాహ్మణులకు సరిపోలేదు. మొదటినుండి ఒకరి మీద ఒకరు ఆధిపత్య పోరును సాగించుచూవచ్చినా, చివరకు తాము వెనుకబడిపోవడము వైశ్యులు ముందుకుపోవడమును బ్రాహ్మణులు జీర్ణించుకోలేకపోయారు. భారత దేశమున పూర్వమునుండి **"ద్రావిడ"** అను భారతీయులుండగా, మధ్యలో మధ్య ఆసియానుండి ఆర్యులు వచ్చి వారియందు బ్రాహ్మణులను కలుపుకొని బ్రాహ్మణులచేత ఆర్యసమాజములను స్థాపింపజేశారు. మధ్య ఆసియానుండి వచ్చిన బ్రాహ్మణులు తమకంటే తెలివైనవారుగాయున్న చంద్రవంశ బోధకులు **వర్తకుడు, శెట్టి, గుప్త, కోమటి, వ్యాపారి** అను పేర్లతో యున్నవారిని చూచి ఓర్చుకోలేక, ముందునుండి సూర్య చంద్ర వంశముల బోధకులకు ఆధిపత్యపోరు ఉన్నదని తెలిసి, బ్రాహ్మణులతో కలిసిపోయిన ఆర్యులు బ్రాహ్మణులను ప్రేరేపించి గుప్త, శెట్టి అను వారికి ప్రత్యేకమయిన పేరుపెట్టి అంతవరకు సమాజములోయున్న పేర్లన్నిటినీ వదలి ప్రజలందరూ తాము పెట్టిన పేరునే చెప్పునట్లు చేయాలనుకొన్నారు.

అప్పటినుండి ఆర్యులలో కలిసిపోయిన ద్రావిడ బ్రాహ్మణులు ఆర్యుల బుద్ధిని తోడు చేసుకొని ఆర్యుల సహాయముతో శెట్టిగారికి ప్రత్యేకమయిన పేరును పెట్టాలనుకొన్నారు. ఆర్యులు భారతదేశములో ప్రవేశించిన తర్వాత బ్రాహ్మణులంతా ఆర్యులుగా మారిపోయి తాము ద్రావిడులము అను మాటను మరచిపోయారు. శెట్టి, గుప్త అనువారి ముందర తాము తక్కువవారుగా కనిపించకూడదని తమను కూడా ఆర్యులుగా చెప్పుకొను చుండిరి. మధ్యలో వచ్చిన ఆర్యులతో కలిసి ఆర్యుల

బుద్ధిని ప్రయోగించి, శెట్టి అను వారు ఆర్యుల తరువాతవారుగానే ఉండవలెనని తలచి, అదే విధముగా శాశ్వితముగా ప్రజలకు కనపడునట్లు ఒక పేరును ఎన్నుకొని దానిని చంద్రవంశ బోధకులకు (శెట్టి, గుప్త అని పిలువబడువారికి) ఆ పేరును పెట్టడము జరిగినది. ఆ పేరులో ముందు ఆర్య అను శబ్ధముండి తర్వాత వైశ్య అను పదమువుండునట్లు చేసి ఆర్యవైశ్య అను దానిని అప్పటి ప్రజలలో ప్రచారము చేశారు. అలా ఆర్యుల ద్వారా శెట్టి, గుప్త అను వారికి ఇవ్వబడిన బిరుదుగా **"ఆర్య వైశ్య"** అను పేరు వచ్చినది. అలా పెట్టబడిన పేరునే నేటికీ ఉండునట్లు ఆర్యులు చేశారు. ఆర్యవైశ్య అనుమాటనుబట్టి 'ఆర్యుల తర్వాతవారే వైశ్యులు' అని అర్థమగునట్లు చేశారు. అంతేకాక ఎవరయినా నోరు తిరగనివారు, పదమును సరిగా పలకలేనివారు పలకలేకపోతే ఆ పదము 'ఆర్యవేశ్య' అనుపదముగా పలకబడుతుందను ఉపాయముతో ఆర్యులయిన వారు ఆ పేరును శెట్టి, గుప్త అను వారికి పెట్టడము జరిగినది. ఎవరయినా పద ఉచ్ఛారణ సరిగా లేనివారు, సరిగా పలుక లేనివారు 'ఆర్యవైశ్య' అను పదము బదులు 'ఆర్యవేశ్య' అని పలుకడము జరుగుచున్నది. దానితో 'ఆర్యులకు వేశ్యలుగాయున్నవారు' అని అర్థము రాగలదని ఆర్యుల బుద్ధిని ప్రయోగించి "ఆర్య వైశ్య" అను పేరును పెట్టారు.

భారతదేశ చరిత్రలో భారతదేశము మొదట ఉత్తరమునుండి దక్షిణము వరకు ద్రావిడ దేశముగా ఉండేది. అయితే మధ్యలో వచ్చిన ఆర్యులు తెలివైనవారు కనుక, వారి తెలివితో భారతదేశమును కొద్దికొద్దిగా ఆక్రమించుతూవచ్చి చివరకు ఆర్యదేశముగా ప్రకటించారు. అయితే త్రేతా యుగమున రావణబ్రహ్మ పాలన దక్షిణ భారతదేశము వరకు ఉండెడిది. కావున ఆర్యులు దక్షిణ భారతదేశమును ఆర్యుల దేశమనీ అనలేకపోయారు.

అందువలన దక్షిణ భారతదేశమును నేటికినీ ద్రావిడ దేశమని, ద్రావిడ ప్రాంతమని పిలువబడుచున్నది. ద్రావిడ ప్రాంతమయిన దక్షిణ భారత దేశమున నేడు కూడా ఆర్యుల పెత్తనము చలామణి అగుచున్నది. ఆర్యుల జ్ఞానము కూడా కలదు. ద్రావిడుల జ్ఞానము అణచివేయబడినది. అందువలన చెడు ఉద్దేశ్యముతో ఆర్యబ్రాహ్మణులు పెట్టిన ఆర్యవైశ్య అను పేరు నేటికీ ఉన్నా, అందులోని ఆంతర్యమేమియని నేడు శెట్టి, గుప్త అనువారు కనుగొనలేకపోయారు. జ్ఞానముతో కూడిన ఐదుపేర్లను తాము పెట్టుకొన్నా, వాటిని మరచిపోయినవారై నేడు తాము పెట్టుకోనటువంటి ఇతర బ్రాహ్మణులు పెట్టినటువంటి 'ఆర్యవైశ్య' అను పేరును నేటి శెట్టిగారు చెప్పుకోవడము జరుగుచున్నది. 'ఆర్యవైశ్య' అనుమాటలో ఏమాత్రము దైవజ్ఞాన సంబంధ అర్థము లేదు. చంద్రవంశము బోధకులకు 'ఆర్యవైశ్య' అను పేరు ఆరవ పేరుయగుచున్నది. ఆరవ పేరు తాము ఏమాత్రము పెట్టుకొన్నది కాదు. ఇతరుల చేత పెట్టబడినది.

ఎంతో జ్ఞానముతో కూడుకొన్న తమపేర్లు తమముందరే కొద్దిగా మారియున్నా నేడు కనుగొనని కోమట్లు, తమకు పూర్వము తమ వంశపు పెద్దలు పెట్టిన పేర్లు ఎంతో జ్ఞానముతో కూడుకొన్నవని తెలియని శెట్టిగారు, నేడు తమకున్న వర్తకుడు, శెట్టి, గుప్త, కోమటి, వ్యాపారి అను పేర్లను కొద్దిగా మార్పు చేస్తే ప్రపంచములోనే గొప్ప జ్ఞానముగా కనిపించునని తెలియని వర్తకులు, చెడు ఉద్దేశ్యముతో ఆర్యబ్రాహ్మణులు పెట్టిన పేరును తమ పేరుగా చెప్పుకొనుచున్నారు. అందులోని చెడును గ్రహించని నేటి వ్యాపారులు, కొద్దిగా ఆలోచించితే, పూర్వపు తమ చరిత్ర ఎలా సాగిందియని వెను తిరిగి చూచుకొంటే, నేడు మేము చెప్పుమాటలన్నీ సత్యమని తెలిసి పోగలవు.

బ్రాహ్మణులు ఆర్యులు కలిసిన ఆర్యబ్రాహ్మణులు తెలివిగా బహూకరించిన "ఆర్య వైశ్య" అను బిరుదును స్వీకరించి, దానినే నేటికీ చెప్పుకోవడము వర్తకులలోయున్న లోపమేయని చెప్పవచ్చును. వైశ్యులు అను పేరు తాము పెట్టుకోకున్నా, అందులో జ్ఞానము ఏమీ లేకున్నా, తాము పెట్టుకొన్న పేర్లే తమకు ముఖ్యమని అనుకోకుండా, తమ పేర్లలో ఏ పేరును వ్రాయకుండా ఎక్కడ వ్రాసినా వైశ్యులని, ఆర్యవైశ్యులని వ్రాయడము చూస్తున్నాము. ఎక్కడ బోర్డు కనిపించినా 'ఆర్య వైశ్య' అని కనిపించుచున్నది. అంతేకాక ఆర్యవైశ్య సంఘములని సంఘములకు పేర్లుపెట్టుకోవడము కూడా జరిగినది. నేడు శెట్టి, గుప్త అని ప్రజల చేత పిలువబడుచున్నా, శెట్టి, గుప్త అనువారు మాత్రము తమను వైశ్యులుగా, ఆర్యవైశ్యులుగా చెప్పుకోవడము జరుగుచున్నది. సమాజములో శెట్టిగారు తెలివైనవారను పేరున్నా, చివరకు ఆర్యబ్రాహ్మణులు విసిరిన ఉచ్చులో (వలలో) శెట్టిగారు తగులుకొని తమనుతాము మరచిపోయి, తమ చరిత్రను తెలియకపోయి, తాము ప్రజలకు జ్ఞానమును బోధించు జ్ఞానులుగా ఉండెడివారమని తెలియక, తమ పెద్దలు తమకు పూర్వము పెట్టిన ఐదు పేర్లు పూర్తి జ్ఞానముతో నిండినవని తెలియకపోయి, కొంత మబ్బులో పడిపోయిన వారి కళ్ళకు కొద్దిగా వెలుగుచూపి 'మీ చరిత్ర ఇది' అని తెలియజేయాలనుకొన్నాము. నేను ద్రావిడ దేశములో పుట్టినవాడను కనుక ద్రావిడుల మీదయున్న అభిమానముతో, ఇటు ద్రావిడ బ్రాహ్మణులకు అటు ద్రావిడ శ్రేష్ఠులకు వారివారి చరిత్రను తెలియజేసి మొదటికి మీరు ద్రావిడులనీ, తర్వాత మీకు ఆర్యుల గాలి సోకినదనీ, గతములో మీ చరిత్ర ఈ విధముగా ఉండేదని మేము తెలియజేయాలనుకొన్నాము. ఆ ప్రయత్నములోని భావముతోనే ఈ చిన్న గ్రంథమును మీకు చేర్చడమైనది.

వాస్తవానికి నేను శెట్టి కులమునకుగానీ, బ్రాహ్మణ కులమునకు గానీ సంబంధములేనివాడను. వాస్తవానికి అన్ని కులములు నావేయను భావముతో కులములేని వాడినని తెలుపుచున్నాము. నేను మనిషిగా యున్నవాడిని కనుక మనుషులందరూ నావారే అను భావముతో, నా జాతివారయిన మనుషులు అజ్ఞానములో లేకుండా అందరూ జ్ఞానులుగా ఉండవలెనను ఉద్దేశ్యముతో గతములో జరిగిన చరిత్రను తోడి చూపాలను కొన్నాను. మనుషులలో పాపాత్ములుయుండవచ్చు, పుణ్యాత్ములుయుండ వచ్చు. అది వారివారి కర్మకు సంబంధించిన విషయము. అయితే ఎంతటి పాపమునయినా సులభముగా జయించు ఉపాయమును ఒక్క దైవజ్ఞానములో మాత్రము గలదు. ఇదే విషయమునే ప్రథమ దైవగ్రంథ మయిన భగవద్గీతలో జ్ఞానయోగమందు 36, 37 శ్లోకములందు **"మనిషి ఎంత పాపాత్ముడయినా కర్మయను మురికి సముద్రమును జ్ఞానము అను ఓడచే దాటగలవు"** అని చెప్పడమేకాక ప్రక్కనే 37వ శ్లోకములో **"అగ్నిలో ఎన్ని కట్టెలు వేసినా అవి కాలి బూడిదయి పోయినట్లు జ్ఞానమను అగ్నిలో ఎంతటి పెద్ద కర్మలయినా కాలి భస్మమైపోవును"** అనికూడా చెప్పారు. మనిషి పూర్వము ఎంతో జ్ఞానిగాయున్నా, జ్ఞానమును తెలిసినవారు మోక్షము పొందగా, జ్ఞానము తెలియనివారు మిగిలిపోగా నేడు అజ్ఞానము భూమిమీద ఎక్కడ చూచినా కనిపిస్తున్నది. పాపమును చేసినవారు ఎన్నో బాధలను అనుభవిస్తూ, బాధపడుచూ నరకయాతనను పొందుచున్నా, తనకెందుకిలా జరుగుచున్నదని ఏమాత్రము ఆలోచించడము లేదు. పూర్వము సామాజిక సౌకర్యములు, నాగరికత లేకున్నా అప్పుడు బ్రతికిన మనుషులు యాతన చెందక, మనోవేదన పొందక సుఖముగానే జీవించిపోయారు. 'ఇప్పటికంటే అప్పుడే కష్టముగా బ్రతికెడివారు' అని

ఎవరయినా అంటే 'అందులో వాస్తవము లేదు' అని చెప్పవచ్చును. అప్పుడు కష్టముగాయున్నా, వారు బాధను అనుభవించకుండా కాలమును గడపినారు.

నేడు కుటుంబములో సౌకర్యములున్నా, ఎన్నో వస్తువులు, వాహనములు వాటి వలన సుఖములువున్నా మనిషిమాత్రము సుఖముగా బ్రతకలేకపోవుచున్నాడు. కారణము ఏమనగా! సామాజిక సుఖములయిన ధనము, ఇల్లు, వస్తువులు, వాహనములు, దుస్తులు ఎన్నివున్నా ప్రకృతి సంబంధ బాధలు ఎక్కువై పూర్వముకంటే ఎక్కువ బాధలను మనిషి అనుభవిస్తున్నాడు. ప్రకృతి సంబంధమైన రోగములు ఎక్కువయిపోయాయి. రోగములేకాక శరీర బలహీనత పెరిగిపోయి అందరికీ బి.పి, షుగర్ అనుమాట వచ్చింది. ప్రకృతిలోని ఎండకుగానీ, గాలికిగానీ, వానకుగానీ మనిషి ఓర్చుకోలేక పోవుచున్నాడు. పూర్వము ఎప్పుడూ లేని విధముగా ప్రకృతి చెలరేగి మనిషిని హింసించడము జరుగుచున్నది. మనిషికి వచ్చే బాధలలో ఎక్కువ శాతము ప్రకృతి సంబంధముగానేయున్నవి. ప్రకృతిలో ఎన్నో విభాగములుగా దేవుని పాలన సాగుచున్నది. దేవుని పాలనను కనిపించని గ్రహములు, భూతములు సాగించుచున్నవి. అందువలన దైవజ్ఞానము లేని ప్రజలను దేవునిపాలనలోని గ్రహములు, భూతములు అనేక కష్టముల పాలు చేయుచున్నవి. జ్ఞానము తెలియని ప్రజలు తమకు జరుగు ప్రమాదములలో, కష్టములలో ఎవరిపాత్రయుందని గ్రహించలేక పోవుచున్నారు. ప్రజలకు కనపించునదంతా స్థూలమైన విషయములే, సూక్ష్మమైనది ఏదీ తెలియదు. గ్రహములు, భూతములు అను దేవుని పాలకులందరూ సూక్ష్మముగానేయుంటూ దేవుని ధ్యాసలేని వారందరినీ, అజ్ఞానములో మునిగి పాపములను చేయువారందరినీ వారి కర్మప్రకారము బాధించుచున్నారు. నేడు మానవ జీవితములన్నీ పైకి బాగానే కనిపించు

చున్నా, లోపల మాత్రము యాతనతో కూడుకొని యున్నవి. అలా జరుగుటకు కారణము మనిషి జీవితములో దైవజ్ఞానము అనునది లేకపోవడమే ముఖ్యకారణమని చెప్పవచ్చును. ఇటువంటి పరిస్థితి రాగలదని ముందే ఊహించిన పెద్దలు దేవుడు చెప్పిన జ్ఞానమును మూడు గ్రంథముల రూపములో అందించి పోయారు. ప్రథమ, మధ్యమ, అంతిమ దైవగ్రంథములను మూడు గ్రంథములు మనిషికి వారసత్వముగా వచ్చిన స్థిరాస్థియని చెప్పవచ్చును. అయితే పెద్దలు ఆస్తిని సంపాదించి ఇచ్చినా చిన్నలు చెడు వ్యసనములకు అలవాటుపడి ఆస్తిని పోగొట్టుకున్నట్లు, మనిషి బయట ప్రపంచ విషయములలో మునిగిపోయి, విషయలోలుడై తనకు తన పెద్దల ద్వారా సంక్రమించిన స్థిరాస్తి అయిన దైవజ్ఞానమును పోగొట్టుకొని అజ్ఞానిగా మిగిలిపోయాడు. ఇప్పటినుంచయినా నీ ఆస్తిని నీవు సంపాదించుకొనుటకు ప్రయత్నించమని చెప్పుచున్నాము.

**-: సమాప్తము :-**

**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

**సనాతనమైనది ఇందూ ధర్మము**

**శాశ్వితమైనది ఇందూ ధర్మము**




**దేవుడు ధర్మములను రక్షిస్తాడు**
**మనిషి ధర్మములను ఆచరిస్తాడు**

# హిందూ రక్షణా! హిందూ భక్షణా!!
# భగవద్గీతయే చదవనివాడు హిందూ రక్షకుడా?
# హిందూ ధర్మమే తెలియనివారు హిందూ రక్షకులా?

హిందువులు నేడు కులాలుగా చీల్చబడి, అందులో హెచ్చుతగ్గు కులములుగా వర్ణించబడియున్నారు అనుట అందరికీ తెలిసిన సత్యమే. దేవుడు మనుషులందరినీ సమానముగా పుట్టించితే కొందరు మనుషులు తమ స్వార్థ బుద్ధితో హిందూ (ఇందూ) సమాజమును ముక్కలు ముక్కలుగా చీల్చి, బలహీనపరచి హిందూసమాజమునకంతటికీ తామే గొప్పవారమనీ, తాము చెప్పినట్లే అందరూ విని, అన్ని కార్యములు చేసుకోవాలనీ ప్రచారము చేసుకొన్నారు. ఎన్నో కులములుగా యున్న హిందూ సమాజములో తమ కులమే అగ్రకులమని చెప్పుకోవడమే కాకుండా, ఇతర కులముల వారందరికీ తామే మార్గదర్శకులమనీ, గురువులమనీ ప్రకటించుకొన్నారు. భవిష్యత్తులో తమకు ఎవరూ అడ్డురాకుండునట్లు, అన్ని కులములను అంటరాని కులములను చేసి, హిందూ సమాజమునకు తీరని అన్యాయము చేశారు. అంతటితో ఆగక నేటికినీ హిందూ సమాజ రక్షకులుగా చెప్పుకొనుచూ, హిందూ సమాజమును సర్వనాశనము చేయుచూ, హిందూ సమాజము ఇతర మతములుగా మారిపోవుటకు మొదటి కారకులగుచున్నారు. అటువంటివారు హిందూ సమాజమునకు చీడ పురుగులుగాయున్నా, మిగతా కులముల వారందరూ వారి నిజ స్వరూపమును తెలియక వారు చెప్పినట్లే వినుట వలన, హిందూ సమాజమును పూర్తిగా అజ్ఞాన దిశవైపుకు, అధర్మ మార్గమువైపుకు మళ్ళించి,

ప్రజలకు ఏమాత్రము దైవజ్ఞానమును తెలియకుండా చేసి, తాము చెప్పునదే దైవబోధయని నమ్మించారు.

అటువంటి స్థితిలో నేడు **త్రైత సిద్ధాంతకర్తగా ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారు** అజ్ఞాన దిశవైపు నిలిచి పోయిన హిందూసమాజమును సరియైన దారిలో పెట్టుటకు, భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమున బోధింపబడిన **క్షర, అక్షర, పురుషోత్తమ** అను ముగ్గురు పురుషుల విషయమును **త్రైత సిద్ధాంతము** అను పేరుతో ప్రతిపాదించి దైవజ్ఞానమును అందరికీ అర్థమగులాగున గ్రంథరూపములో వ్రాయడము, బోధించడము జరుగుచున్నది. దానివలన నేడు ప్రజలు అసలైన జ్ఞానము తెలియుచున్నదని సంతోషపడుచున్నారు. అగ్రకులముగానున్న వారిలో కూడా ఎందరో తమ అజ్ఞాన చీకటులను వదలి, ఇంతవరకూ తమకు తెలియనిజ్ఞానము యోగీశ్వరుల ద్వారా ఇప్పుడు తెలియుచున్నదని సంతోషపడి శిష్యులుగా చేరిపోవుచున్నారు. అయితే అగ్రకులములో కొందరు మాత్రము యోగీశ్వరులు తెలియజేయు జ్ఞాన విషయములను చూచి ఈ జ్ఞానము వలన ప్రజలు జ్ఞానములో చైతన్యులై, జ్ఞానము తెలియని తమను గౌరవించరని భావించి, దానివలన సమాజము మీద తమ ఆధిపత్యము లేకుండా పోవునని తలచి, యోగీశ్వరులు తెలుపుచున్న త్రైత సిద్ధాంతము గానీ, త్రైత సిద్ధాంత భగవద్గీతగానీ హిందువుల జ్ఞానమే కాదనీ, అది క్రైస్థవ మతమునకు సంబంధించినదనీ, దానిని ఎవరూ చదవకూడదని ప్రచారము చేయను మొదలుపెట్టారు. అంతేకాక తాము హిందూధర్మరక్షకులమని, కొంత రాజకీయరంగు పూసుకొని, మా జ్ఞాన ప్రచారమునకు అక్కడక్కడ అడ్డుపడడము జరుగుచున్నది. తమ మాట

విను ఇతర కులముల వారికి కూడా ప్రబోధానందయోగీశ్వరులు చెప్పు జ్ఞానము హిందూ జ్ఞానము కాదు, క్రైస్థవుల జ్ఞానమని హిందువుల ముసుగులో క్రైస్థవ మత ప్రచారము చేయుచున్నారని చెప్పడమేకాక, అటువంటివారిని ప్రేరేపించి మా ప్రచారమునకు అడ్డు తగులునట్లు చేయుచున్నారు.

యోగీశ్వరులు నెలకొల్పిన హిందూ (ఇందూ) జ్ఞాన వేదిక ఇటువంటి ఆగడాలను కొంతకాలముగా ఓర్పుతో చూడడము జరిగినది. మాలో ఓర్పు నశించి, మమ్ములను అన్యమత ప్రచారకులుగా వర్ణించి చెప్పు అగ్రకులము వారిని, వారి అనుచరులను మేము ఎదురుదిరిగి ప్రశ్నించడము జరిగినది. మేము ప్రశ్నించిన ఒక్క ప్రశ్నకు కూడా వారు సరియైన సమాధానము ఇవ్వలేదు. ఆ జవాబులు ఎలా ఉన్నాయో పాఠకులుగా మీరు చూడండి.

**మా ప్రశ్న :-** ఇంతవరకు ఏ హిందువూ చేయని విధముగా ఊరూరు తిరిగి, ఊరులో ఇల్లిల్లూ తిరిగి హిందూ ధర్మములను ప్రచారము చేయుచున్నాము కదా! అటువంటి మమ్ములను మీరు అన్యమత ప్రచారకులుగా ఎందుకు చెప్పుచున్నారు?

**వారి జవాబు :-** హిందూమతములో ఎందరో స్వామీజీలు ఉన్నారు. వారు ఎవరూ ఇల్లిల్లు తిరిగి ప్రచారము చేయలేదు. హిందువులు అట్లు ఎవరూ ప్రచారము చేయరు. క్రైస్తవులయితేనే బజారు బజారు, ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేస్తారు. మీరు హిందువుల ముసుగులో ఇల్లిల్లూ తిరిగి క్రైస్తవమును ప్రచారము చేయుచున్నారు.

**మా ప్రశ్న :-** మేము క్రైస్తవులమయితే భగవద్గీతను ఎందుకు ప్రచారము చేస్తాము?

**వారి జవాబు :-** మీరు ప్రచారము చేయునది త్రైత సిద్ధాంత భగవద్గీత. అది క్రైస్తవులది. బైబిలుకే మీరు అలా పేరు పెట్టారు.

**మా ప్రశ్న :-** క్రైస్తవులు తమను క్రైస్తవులుగానే చెప్పుకుంటారు. అలాగే బైబిలును బైబిలుగానే చెప్పుకొంటారు. వారి ప్రచారము క్రైస్తవము, బైబిలు అయినప్పుడు అదే పేరుమీద ప్రచారము చేస్తారు తప్ప హిందువులుగా భగవద్గీత పేరుతో ఎందుకు ప్రచారము చేస్తారు? ఇంతవరకు అట్లు ఎక్కడా జరుగలేదు. ఏ మతమువారు ఆ మతము పేరు చెప్పుకొంటారు గానీ ఇతర మతముపేరు చెప్పరు. అంతెందుకు మీరు మా భగవద్గీతను తెరచి చూచారా? అందులో భగవద్గీత శ్లోకములున్నాయా? బైబిలు వాక్యము లున్నాయా?

**వారి జవాబు :-** త్రైతసిద్ధాంతమని యున్నది కదా! త్రైతము అంటే త్రిత్వము అని త్రినిటి అని మాకు బాగా తెలుసు.

**మా ప్రశ్న :-** హిందూ ధర్మములలో అద్వైత సిద్ధాంతమును ఆదిశంకరా చార్యుడు ప్రతిపాదించాడు. విశిష్టాద్వైతమును రామానుజాచార్యులు ప్రతిపాదించాడు, ద్వైతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. ఇప్పుడు ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు త్రైతసిద్ధాంతమును ప్రతిపాదించాడు. సిద్ధాంతకర్తలు, సిద్ధాంతములు వేరయినా అందరూ హిందువులని మీరు ఎందుకు అనుకోలేదు?

**వారి జవాబు :-** మీ త్రైతసిద్ధాంత భగవద్గీతలో యజ్ఞములను చేయకూడదని వ్రాశారు కదా! నిజముగా భగవద్గీతలో అలా లేదు కదా!

**మా ప్రశ్న :-** మీరు హిందువులలో ముఖ్యులుగా వుండి అంత మూర్ఖముగా మాట్లాడితే ఎలా? ప్రపంచమునకంతటికీ ఒకే భగవద్గీతయుంటుంది గానీ, మీ భగవద్గీత, మా భగవద్గీతయని వేరుగా ఉండదు. భగవద్గీతకు వివరము ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా వారికి అర్థమయినట్లు చెప్పియుండవచ్చును గానీ, అందరికీ భగవద్గీత మూల గ్రంథమొక్కటేనని గుర్తుంచుకోండి. త్రైత సిద్ధాంత భగవద్గీత అన్నిటికంటే సరియైన భావముతో యున్నదని చదివిన జ్ఞానులందరూ పొగడుచూయుంటే, మీ కులములో ఎందరో ప్రశంసించు చూయుంటే, మీకు కొందరికి మాత్రము వ్యతిరేఖముగా కనిపించిందనడము అసూయతోనే అని మాకు అర్థమగుచున్నది. యజ్ఞములు చేయవద్దని మేము ఎక్కడా చెప్పలేదు. యజ్ఞముల వలన పుణ్యము వస్తుంది, స్వర్గము వస్తుంది అని చెప్పాము. యజ్ఞముల వలన మోక్షము రాదు, దేవుడు తెలియడని చెప్పాము. అంతెందుకు మీరు మేము అన్ని కులములకంటే స్వచ్ఛమయిన హిందువులమని చెప్పుకొంటున్నారు కదా! భగవద్గీతలో చెప్పిన ఒక్క హిందూ ధర్మమును చెప్పండి.

**వారి జవాబు :-** అవన్నీ మాటలు వద్దు... మీరు హిందువులు కాదు.

**మా ప్రశ్న :-** మొండిగా మాట్లాడవద్దండి మీరు అగ్రకులమువారమని ఇష్టమొచ్చినట్లు మాట్లాడకండి. మేము హిందువులము కాము అనుటకు ఆధారము ఏమైనా చూపగలరా? మా కథ అట్లుంచి మీరు సరియైన హిందువులే అయితే భగవద్గీతలో విశ్వరూప సందర్శనయోగమను అధ్యాయములో 48వ శ్లోకములోనూ, 53వ శ్లోకములోనూ భగవంతుడు ఏమి చెప్పాడో మీరే చెప్పండి.

**వారి జవాబు :-** మేము ఇంతవరకు భగవద్గీత చదువలేదు. మీకు కావలసి వస్తే సంపూర్ణానందస్వామితో చెప్పిస్తాము.

**మా ప్రశ్న :-** కనీసము భగవద్గీతను కూడా చదువని మీరు యోగీశ్వరులయిన ప్రబోధానందస్వామిని దూషించడము మంచిదా? ఒక్క హిందూ ధర్మమును కూడా తెలియని మీరు హిందూ ధర్మ రక్షకులమని చెప్పడము మంచిదా? యోగీశ్వరుల వారు వ్రాసిన ఒక్క గ్రంథము కూడా చదువకుండ మేము తప్ప పూజ్యులుగా, గురువులుగా ఎవరూ ఉండకూడదను అసూయతో ఇలాగ మాట్లాడితే దేవుడు ఓర్చుకోడని చెప్పుచున్నాము.

**వారి జవాబు :-** హిందూ మతములో ఎందరో దేవుళ్ళున్నారు. శివుడు దేవుడే, శివుని కొడుకు గణపతి దేవుడే, రాముడు దేవుడే, రాముని సేవకుడు ఆంజనేయుడు దేవుడే. అలాంటి హిందూ మతములో దేవుడు ఒక్కడే అని చెప్పడము మీది తప్పు కాదా?

**మా మాట :-** మేము మతమును గురించి చెప్పలేదు. హిందూ మతములో ఎందరో దేవుళ్ళుండడము నిజమే, అయితే హిందూ జ్ఞానములో, హిందూ ధర్మము ప్రకారము విశ్వమునకంతటికి ఒకే దేవుడని చెప్పాము. భగవద్గీతలో దేవుడు చెప్పినదే చెప్పాము తప్ప మేము దేవతలను గురించి లేరని చెప్పలేదే! దేవతలకందరికీ అధిపతియైన దేవుడు ఒక్కడున్నాడని, ఆయనే దేవదేవుడనీ, అతనిని ఆరాధించమని చెప్పాము.

**వారి జవాబు :-** మీరు రాముని పేరు చెప్పరు, శివుని పేరు చెప్పరు, వినాయకుని పేరు చెప్పరు. ఎవరి పేరూ చెప్పకుండా దేవుడు అనీ, సృష్టికర్తయనీ అనేకమార్లు పేర్కొన్నారు. దేవుడు అను పదమునుగానీ,

సృష్ఠికర్తయను పదమునుగానీ క్రైస్తవులే వాడుతారు. హిందువులు వాడరు. అందువలన మిమ్ములను హిందువులు కాదు క్రైస్తవులు అంటున్నాము.

**మా ప్రశ్న :-** క్రైస్తవ మతము పుట్టి రెండువేల సంవత్సరములయినది. సృష్ఠిపుట్టి ఎన్ని కోట్ల సంవత్సరములయినదో ఎవరూ చెప్పలేరు. సృష్ట్యాది నుండి 'సృష్ఠికర్త' అను పదమును 'దేవుడు' అను పదమును హిందూ సమాజము వాడుతూనే యున్నది. మొదటినుండి హిందూసమాజములో యున్న దేవుడు, సృష్ఠికర్త అను పేర్లను హిందువులు క్రైస్తవులకేమయినా లీజుకిచ్చారా? లేక పూర్తిగా వారికే అమ్మేశారా? అని అడుగుచున్నాము. సృష్ఠికర్త అనిగానీ, దేవుడు అనిగానీ హిందువులయినవారు అనకూడదని ఎక్కడయినా ఉన్నదా అని అడుగుచున్నాము?

**వారి జవాబు :-** మీరు హిందూమతమును కాకుండా అన్యమతమును బోధించుచున్నారనుటకు, మిమ్ములను మీరు హిందువులుగా చెప్పుకో లేదు. హిందువులుగా కాకుండా ఇందువులుగా చెప్పుకొంటున్నారు. అటువంటప్పుడు మీరు హిందూమతమును చీల్చినట్లు కాదా! ప్రత్యేకించి ఇందూ మతము అను దానిని ప్రచారము చేసినట్లు కాదా! మీరు హిందువులే అయినప్పుడు మీ గ్రంథములలోగానీ, మీ బోధలలో గానీ ప్రత్యేకించి ఇందువులు అని ఎందుకు చెప్పుచున్నారు?

**మా మాట :-** మేము సూటిగా ఒక ప్రశ్నను అడుగుతాము జవాబు చెప్పండి. హిందువు, ఇందువు అను పదములో కొద్దిపాటి శబ్దము తప్ప ఏమి తేడాయుందో మీరే చెప్పండి. తెలుగు భాషను వ్రాసే వారందరూ హిరణ్యకశ్యపున్ని చంపినది నరశింహస్వామి అని చెప్పుచుందురు అలాగే వ్రాయుచుందురు. ప్రస్తుత కాలములో నరశింహులు అని పేరున్నవాడు

కూడా వాని పేరును నరశింహులు అని వ్రాయడము అందరికీ తెలుసు. అయితే ఆ మాట తప్పు అలా వ్రాయకూడదు దానిని **నరసింహ** అని వ్రాయవలెను అని చెప్పుచున్నాము. అడవిలో మృగరాజును **సింహము** అని అంటాము తప్ప **శింహము** అని అనము అనికూడ చెప్పుచున్నాము. 'సింహము' అంటే అర్థమున్నది గానీ, 'శింహము' అంటే అర్థము లేదు అని కూడా చెప్పాము. అలా ఉన్నది ఉన్నట్లు చెప్పితే 'ఇందువు' అనే దానికి అర్థమున్నదిగానీ 'హిందువు' అనే దానికి అర్థములేదు అని చెప్పాము. సృష్ట్యాదిలో పుట్టినది ఇందూ సమాజమనీ, అది మధ్యలో పేరుమారి 'దృష్ఠి, జిష్ఠి' అయినట్లు **'ఇందూ'** అను శబ్దము **'హిందూ'** అని పలుకబడుచున్నదని చెప్పాము. ఇందూ పదము ఎందుకు వాడాలి, హిందూ పదమును ఎందుకు వాడకూడదని కూడా వివరముగా మా గ్రంథములలో గలదు. ఉన్న సత్యము మీకు తెలిసినా, మీరు మాకంటే పెద్ద ఎవరూ ఉండకూడదను అసూయతో మాట్లాడుచున్నారు.

అగ్రకులములో ఎందరో పెద్దలు మా జ్ఞానమును తెలిసి సంతోషించుచుండగా, కొందరు మాత్రము వీధి రౌడీలలాగా తంతాము, పొడుస్తాము, కాలుస్తాము మీరు ప్రచారము చేయవద్దండని చెప్పడము మంచిది కాదు. మా గ్రంథములు ఏదీ చదువకుండా మాట్లాడడమూ, మేము చెప్పిన మాటలను వినకుండా ఇవన్నీ డ్రామాలు, నాటకాలు అనడము మంచిది కాదు. మీరు ఎవరైనా మా గ్రంథములలో ఇతర మతములను ప్రచారము చేసినట్లుగానీ, ఫలానా మతములోనికి చేరమని చెప్పినట్లుగానీ ఉంటే నిరూపణ చేయండి, అలా నిరూపించిన వారికి ఇందూ జ్ఞానవేదిక తరపున పది లక్షల రూపాయలను ఇవ్వగలము.

నిరూపించ లేకపోతే మీరు లక్ష రూపాయలు ఏ ఊరిలో శ్రీకృష్ణుని గుడికయినా ఇవ్వవలెను. ఈ షరతుకు ఎవరైనా ముందుకు వస్తారా? అని అడుగుచున్నాము.

ఇట్లు

# ఇందూ జ్ఞానవేదిక



# వార్తకుడు - వర్తకుడు





ప్రచురించిన వారు

**ద్రావిడ శ్రేష్ఠి సంఘం (D.S.S)**

**(Regd.No.: 266/2015)**

***www.dravidashreshtisangham.org***

e-mail id : info@dravidashreshtisangham.org